బొమ్మల

# ఆలీబాబా 40 దొంగలు

2400
ROP



రెంటాల గోపాల కృష్ణమూర్తి

నవరత్న బుక్ సెంటర్
ఏలూరు రోడ్, * విజయవాడ-520002.

# మా స్వంత ప్రచురణలు

బొమ్మల శ్రీ షిర్డీసాయి జీవితచరిత్ర
" అక్బర్ బీర్‌బల్ వినోదకథలు
" తెనాలి రామకృష్ణుని సంపూర్ణ హాస్యకథలు
" ఆలీబాబా 40 దొంగలు
" అల్లావుద్దీన్ అద్భుతదీపం
" గలివర్ సాహస యాత్రలు
" శ్రీ శ్రీ శ్రీ మర్యాదరామన్న కథలు
" భట్టి విక్రమార్కుని సాహసకథలు 2 భాగాలు
" భేతాళకథలు
" మొగల్ సామ్రాజ్య కథాగాయకులు
" ప్రవక్త మహమ్మద్
" ఏసుక్రీస్తుకథలు
" మదర్ థెరిస్సా
" రవీంద్రనాథఠాగూర్
" యోగి వేమన
" భగత్‌సింగ్
" అంబేద్కర్
" యశపాల్‌కపూర్
" భగవతీచరణ
" సుభాస్‌చంద్రబోస్
" చంద్రశేఖరఆజాద్
" జయప్రకాష్ నారాయణ్
" సంఘసంస్కర్త రాజారామమోహనరాయ్
" పూజ్యబాపూజీ

బొమ్మల పంచతంత్రం (2 భాగాలు)
" రామాయణం
" భారతం
" భాగవతం
" దశావతారాలు
" శ్రీకృష్ణలీలలు
" పరమానందయ్యశిష్యులు
" శ్రీ వెంకటేశ్వరలీలలు
" శ్రీ అయ్యప్పలీలలు
" శ్రీరామపట్టాభిషేకం
" జై వీర హనుమాన్
" పల్నాటివీరచరిత్ర
" బాలనాగమ్మ
" శ్రీ కాళహస్తిమహాత్మ్యం.
" శ్రీశైలక్షేత్ర మహాత్మ్యం
" శ్రీ సింహాచలక్షేత్రము
" శ్రీ యాదగిరి నరసింహస్వామి చరిత్ర
" శ్రీ కాశీ రామేశ్వర మజిలీలకథలు
" కోటప్పకొండ చరిత్ర
" శ్రీ వినాయక విజయము
" శ్రీ భద్రాచల మహాత్మ్యం
" శ్రీ పాండురంగలీలలు
" శ్రీ రాఘవేంద్రలీలలు
" కనకదుర్గ మహాత్మ్యం
" శివలీలలు

# ఆలీబాబా 40 దొంగలు

ఎన్నో ఏండ్లనాటి మాట. పర్షియాదేశంలో ఒక పెద్ద పట్టణముండేది. పురాతనమైనది కావడం వలన పట్టణమైనప్పటికీ అక్కడ పల్లెటూరి వాతావరణం అలుముకుని ఉండేది. ఆపట్టణంలో తోళ్ళ వ్యాపారస్తుడయిన ఒక మహమ్మదీయు డున్నాడు. అతనికి ఇద్దరు కొడుకులు. పెద్దవాడి పేరు కాశింబాబా. చిన్నవాడి పేరు ఆలీబాబా. తండ్రి ముసలివాడయినాడు. అవసానకాలం ప్రాప్తించింది. అప్పుడా వృద్ధుడు తనవద్దఉన్న కొద్దిపాటి ఆస్థిని, కుమారులిద్దరికీ సమానంగా పంచియిచ్చి కష్టపడి బ్రతకండని చెప్పి కన్నుమూశాడు.

ఒకతల్లి కడుపున పుట్టినా కాశింబాబాకు ఆలీబాబాకు ఎంతోవ్యత్యాసముంది. కాశిం స్వార్థపరుడు. పిల్లికిబిచ్చంపెట్టడు. పైగాఅపరిమితమైన ధనాశ. బుద్ధిమంచిది కాదు. దుర్మార్గపు ఆలోచన. తమ్ముడంటే అతనికి అంతగా ప్రేమ కూడా లేదు. అయితే అలీ ఇందుకు పూర్తిగా విరుద్ధం. అతనిది జాలిగుండె. ఎవరు కష్టంలో ఉన్నా చూడలేడు. అన్నగారంటే అతనికి ఎంతోప్రేమ, గౌరవం. ఉన్నంతలో తృప్తిపడే గుణం. సాధుస్వభావం.

ఇలా ఉండగా కలిసొచ్చే రోజులలో అన్నీ కలిసొస్తాయన్నట్లు కాశిం ఒక ధనవంతుల పిల్లను పెళ్ళి చేసుకున్నాడు. ఒక్కతే కూతురు కావడం వలన బోలెడంత ఆస్థికి ఆమె వారసురాలయింది. ఇంకేం? భార్య ఆస్తి రావడంతో కాశిం

చాలా ధనవంతుడైనాడు. పెద్దభవనాలు కట్టించాడు. స్థలాలు, పొలాలుకొన్నాడు. డబ్బు రావడంతో అతనికి అహంకారం కూడా పెరిగింది. పలుకుబడి, పేరు



ప్రతిష్టలు హెచ్చాయి. భర్తకు తగినట్లే కాశీం భార్యకూడా గర్విష్టి. ఇతరుల బాగు చూచి ఏమాత్రం ఓర్వలేని గుణం. చిన్నవాడయిన ఆలీబాబా కూడా పెళ్ళి చేసుకున్నాడు. అతని అదృష్టం అలాఉంది. అతని భార్య పేదయింటిపిల్ల. మాయలు మర్మాలు తెలియని పాతకాలపు మనిషి. అయినా ఆలీబాబా ఆ పేదరికంలోనే ఆనందంగా ఉంటూ వచ్చాడు. అన్నగారి ఐశ్వర్యం చూచి అతను ఏనాడూ అసూయపడలేదు. రోజూ పట్టణానికి సమీపంలో ఉన్న అడవికి వెళ్ళేవాడు.

అక్కడ ఎండు కట్టెలు కొట్టి, వాటిని తనదగ్గరున్న గాడిదపై వేసుకొని అమ్ము కుంటూ ఆ వచ్చిన డబ్బుతో కుటుంబాన్ని పోషించుకుంటూ ఉండేవాడు. అయినప్పటికీ కాశీంకు, అతని భార్యకు ఆలీబాబా అన్నా, అతనిభార్యఅన్నా సరిపడేది కాదు. వారిద్దరి ఇళ్ళూ, ఒకే వీధిలో దగ్గరదగ్గరగా ఉన్నప్పటికీ కాశీం కుటుంబం, ఆలీబాబా కుటుంబాన్ని ఏనాడూ ఆప్యాయతతో పలకరించడంగాని, అతని కష్ట సుఖాలు విచారించడంగాని చేయలేదు. అయినా ఆలీబాబా అతనిభార్య అందుకు బాధపడలేదు. భగవంతుని నమ్ముకుని బ్రతుకు తెల్లవారుస్తున్నారు. కొన్నాళ్ళకు ఆలీబాబాకు ఒక కొడుకు పుట్టాడు. తల్లిపాలులేనందువలన బిడ్డను పెంచడం కష్ట మైనది. కుటుంబంలోఖర్చు ఎక్కువైంది సంపాదనమాత్రం పెరగలేదు. దరిద్రము అనుభవిస్తూ ఆలీబాబా, భగవంతుడిపై భారంవేసి, సంసారము ఈదుతున్నాడు.

## దొంగల గుహ

ఒకనాడు ఆలీబాబా రోజూ మాదిరిగానే గాడిదను వెంటపెట్టుకుని అడవికి వెళ్ళాడు. ఎండుకట్టెలు ఎక్కడా దొరకలేదు. కట్టెలు కొట్టుకుందామంటే ఎండిపోయిన చెట్లు కూడా కనిపించలేదు. ఈపూట గడిచేది ఎలాగురా భగవంతుడా అని తన దురదృష్టాన్ని తలుచుకుంటూ తిరిగి తిరిగి అరణ్యంలో చాలాదూరం వెళ్ళాడు. అంతలో దూరంనుంచి పెద్దధూళి రేగింది. ఏమిటా అని ఆలీబాబా చూస్తుండగానే గుర్రపు డెక్కల సవ్వడి వినవచ్చింది. గుర్రాలపై కొందరు వీరులు భయంకరమయిన ఆయుధాలు ధరించి రావడం కనిపించింది. రానురాను వారు తన సమీపానికి రావడం చూచి ఆలీబాబా భయకంపితుడైనాడు. అక్కడ

ఒకకొండ గుట్ట ఉంటే గాడిదను ఆ కొండగుట్టచాటున ఉంచి, తాను గుట్టఎక్కి, దుబ్బులచాటున దాగి ఉండి ఏం జరుగుతుందో అని ఆతృతతో చూడసాగాడు.



ఆ ప్రాంతంలో చెట్లు, పొదలు దట్టంగా మొలిచి ఉండడం వలన ఆలీబాబా ఎవరికీ కనిపించలేదు. కాని ఎత్తయిన గుట్టమీద ఉన్నందున అంతా అతనికి కనిపిస్తూఉంది. అక్కడున్న కొండగుహదగ్గరికి వచ్చి గుర్రాలగుంపు ఆగి పోయింది. ఆ గుర్రాలను ఆలీబాబా లెక్కపెట్టాడు. మొత్తం నలభయి గుర్రాలు. నలభయిమంది వీరులు గుర్రాలు దిగారు. వారంతా మహాకాయులు. చాలాబలిష్ఠులు.

అందరిదగ్గరా పొడుగాటి కత్తులున్నాయి. గడ్డాలు పెంచుకొని తలకు నల్లటిగుడ్డలు చుట్టుకున్నారు. వారివాలకం చూచి ఆలీబాబా అదొక దొంగలముఠా అని గ్రహించాడు. ఆ నలభై మందిలో ఒకడు మరీ ఎత్తుగా బలంగా కోరమీసాలతో ఉన్నాడు. మనిషిలో దర్జా, దర్పం కనిపిస్తున్నాయి. అతను దొంగలముఠా నాయకుడై ఉంటాడని ఊహించాడు ఆలీబాబా.



గుర్రాలు దిగగానే ఆ నలభై మంది దొంగల గుంపు మధ్యలో నుంచి దొంగల నాయకుడు కొండగుహదగ్గరికి వచ్చాడు. "బీబీ బీగం రాస్తాఖోడో!" అన్నాడు బిగ్గరగా. అలా మూడుసార్లు బిగ్గరగా పలికి గుహతలుపు చేత్తోతట్టాడు.

ఆశ్చర్యం! వెంటనే గుహ తలుపులు వాటంతట అవే తెరుచుకున్నాయి. ఆలీబాబా ఇదంతా ఏదో కలలో చూచినట్లు చూస్తున్నాడు. అంతట దొంగలు, తాము దోచుకుని వచ్చిన ధనం సంచులను గుర్రాలమీదినుంచి దింపారు. ఆ మూటలు బుజాన తగిలించుకొని ఒక్కొక్కరు గుహలోపలికి వెళ్ళారు.

కొంతసేపటికి నలభైమంది దొంగలూ ఒక్కొక్కరే గుహలో నుంచి బయటకి వచ్చారు. అందరికంటె చివర దొంగల నాయకుడు వచ్చాడు. గుహ తలుపుల దగ్గర నిలుచుని "బీబీ బేగం రాస్తా బంద్" అని బిగ్గరగా అన్నాడు. అలా మూడుసార్లు పెద్దగా అనగానే గుహ తలుపులు వాటంతట అవే కిర్రుమని శబ్దంచేస్తూ మూసుకున్నాయి. ఆలీబాబా ఆశ్చర్యానికి అంతులేదు. తరువాత దొంగలందరూ తమ గుర్రాలమీద ఎక్కి వెనుతిరిగి చూడకుండా దౌడు తీయిస్తూ వెళ్ళిపోయారు.

దొంగలు పూర్తిగా కనుమరుగై పోయిన తరువాత ఆలీబాబాకు మళ్ళీ ఎక్కడలేని ధైర్యం వచ్చింది. బ్రతికిపోయాను— అని అనుకుంటూ తన గాడిదను తోలుకుని కొండగుహ దగ్గరికి వెళ్ళాడు, దొంగలనాయకుడు పఠించిన మంత్రం అతనికి బాగా జ్ఞాపకం ఉంది. గుహద్వారం వద్దకు వచ్చి ఎవరైనా చూస్తారేమోనని చుట్టుప్రక్కల కలయచూచాడు. ఆ నిర్జనారణ్యంలో ఎవరూలేరని తెలుసుకుని "బీబీ బేగం రాస్తా ఛోడో!" అని బిగ్గరగామూడుసార్లు అని గుహద్వారంపట్టాడు. వెంటనే గుహద్వారం తెరుచుకున్నది. ఆలీబాబా గుండెలు దడదడ కొట్టుకుంటున్నాయి. ఐనా ధైర్యం తెచ్చుకొని, గాడిదను గుహ బయటనే ఉంచి, మెల్లగా

తాను గుహలోకి వెళ్ళాడు. మొదట్లో కొంత కష్టంగా ఉన్నా పోనుపోను గుహ విశాలంగా వుంది. చీకటిగా వుండవలసిన ఆ గుహ ఎక్కడలేని కాంతితో వెలిగి పోతున్నది. అక్కడ ఎన్నో రత్నాలు, మణులు, రకరకాల వెండి, బంగారు నాణాలు గుట్టలుగుట్టలుగా పడివున్నాయి. వాటికాంతి వలననే గుహ ఎంతో ప్రకాశ వంతంగా వుంది. ఆలీబాబా తన కళ్ళను తానే నమ్మలేకపోయాడు. అదంతా దొంగలు కొల్లగొట్టుకునివచ్చిన ధనం. ఎన్నో విలువయిన చిత్రవిచిత్రమయిన పాత్రలు, సామానులు ఉన్నాయి. కొంత ధనం, బంగారునాణాలు సంచులలో మూటలు కట్టివున్నాయి. ఆలీబాబా ఎక్కడలేని ఆనందంతో పొంగిపోయాడు. అదృష్టదేవత తనను కరుణించిందనీ, నేటితో తన దరిద్రం తీరిపోయిందని అను కున్నాడు. చేతికి చిక్కినంతవరకు, మోయగలిగినంతవరకు ధనం, బంగారం సంచిలో మూటగట్టి తెచ్చి గాడిదపై వేశాడు. తరువాత గుహవెలుపలికి వచ్చాడు. ద్వారంవద్ద నిలుచుని "బీబీ బిగం రాస్తాబంద్!" అని మూడుసార్లు బిగ్గరగా అన్నాడు. వెంటనే గుహద్వారం మూసుకుంది.

ఆ విధంగా ఆలీబాబా గాడిదపై ధనం సంచి వేసుకుని చీకటిపడేవేళకు ఇల్లు చేరుకున్నాడు. ఇంటి తలుపు గట్టిగా బిగించి లోపల గదిలో కూచుని ధనం సంచీ విప్పాడు. అందులోని బంగారు నాణాలు, అమూల్యమయిన ఆభరణాలు, అన్నీ క్రిందపోశాడు. వాటిమధ్యకూచుని ఆనందించసాగాడు.

అంతలో ఆలీబాబా భార్య లోపల వంట పనులు ముగించుకొని భర్త దగ్గరికి వచ్చింది. అక్కడ వున్న ధనం, బంగారం, నగలు చూచి నిర్ఘాంత పోయింది. కొంతసేపటికి తెప్పరిల్లుకుని "అమ్మో! ఇంతధనమా! ఇన్ని బంగారు

నాణాలా! ఎక్కడివి ఇవన్నీ? ఇంత ధనం ఎక్కడనుంచి తెచ్చారు? ఇదంతా మన దేనా?" అని తొట్రుపాటు చెందుతూ ప్రశ్నలవర్షం కురిపించింది.



"ఓసీ, పిచ్చి మొద్దా! పెద్దగా అరవకు. ఎవరి చెవినైనా పడితే కొంప లంటుకుంటాయి. ఇవాల్టితో మన దరిద్రం తీరిపోయింది. నేనిప్పుడు మా అన్న కాశీంభాయి కంటె ధనవంతుడ్ని. నీవు మా వదినెకన్నా భాగ్యవంతురాలివి!" అన్నాడు ఆలీబాబా.

అదివిని ఆలీబాబా భార్య సంతోషించింది. అయితే, ఆమెకులోలోపలభయ ముగా వుంది. "అయితే ఇంత ధనం ఎక్కడనుంచి వచ్చిందిమీకు? పూటకుగతిలేని మనకు ఎవరిచ్చారు ఇంత ధనాన్ని? ఎక్కడైనా దొంగిలించి తెచ్చారా? లేక ఎవరి నైనా ఖతంచేసి తెచ్చారా? నాకునిజం చెప్పండి?" అని గద్దించి అడిగింది.

ఆలీబాబా చిరునవ్వు నవ్వాడు. "మేరే ప్యారే బీబీ! నీకు చెప్పకుండా ఇంకెవరికి చెపుతాను? అంతా చెపుతాను- విను"—— అంటూ అడవిలో జరిగిన విషయమంతా పూస గుచ్చినట్లు భార్యకుచెప్పాడు. "నీవు ఈ సంగతి ఎవరితోనూ చెప్పకు? ఎవరికి తెలిసినా కుళ్ళుకుంటారు. మా అన్నకు, వదినకు అసలు తెలియ నివ్వకు. మనమంటే వాళ్ళకు అసలు గిట్టదు. మనం పచ్చగా ఉన్నామంటె మా వదిన అసలు ఓర్వలేదు. పైగా పెదవిదాటితే పృథివి దాటుతుందని సామెత. మీ ఆడవాళ్ళ నోట్లో నూగు గింజదాగదు. లోకులకు తెలిసిందీ అంటే, ఆనోటా ఆ నోటాపడి అడవిలో దొంగలకు తెలిసిపోతుంది. వాళ్ళు వచ్చి మనయింటిమీదపడి మన ప్రాణాలు తీస్తారు." అని హెచ్చరించాడు ఆలీబాబా.

అతని భార్య అంతావిని అలాగేనని మాట ఇచ్చింది. తరువాత ఆలీ బాబా ధనం సంచిలో వున్న బంగారునాణాలు లెక్కపెట్టడం మొదలుపెట్టాడు. చేతులు తీపులు పుడుతున్నాయిగాని ఎంతసేపటికీ లెక్కతెమలడంలేదు. ఆలీబాబాకు విసుగొచ్చింది. "బీబీ! తెల్లవారుతున్నది ఈ ధనం లెక్కపెట్టడం తెగడంలేదు. ఎవరికంటన్నా పడితే ప్రమాదం. ఇలాగే ఈ ధనాన్ని మన ఇంట్లోనే ఒకమూల

గొయ్యితీసి పూడ్చిపెడదాం. కావలసినపుడు కొంచెంకొంచెం తీసి వాడుకుందాం" అని వుపాయం చెప్పాడు.

కాలం కలిసొచ్చే సమయానికి తెలివితక్కువ వాళ్ళకూడా దాసంతట అదే తెలివి పుట్టుక వస్తుంటట. అప్పుడు అమాయకురాలైన ఆలీ భార్యకు ఒక ఆలోచన తట్టి భర్తతో ఇలా అన్నది.

"పారేసినా డబ్బు, లెక్కపెట్టి పారేయమన్నారు పెద్దలు. అనుకో కుండా అల్లా దయవలన మనకు అపారంగా ధనం వచ్చింది. కాని మనదగ్గర



ఎంత ధనం వున్నదో మనకైనా తెలియాలికదా! లెక్క పెట్టడం మీకు ఎలాగూ కుదరలేదు. అంచేత ఈ బంగారు నాణేలను కుంచంతో కొలుద్దాం. త్వరగాలెక్క తేలిపోతుంది. తరువాత భూమిలో పాతిపెడదాం" అని చెప్పింది.

ఈ ఆలోచన ఆలీబాబాకు నచ్చింది. కాని కుంచం ఎక్కడుంది? "ఓసి పిచ్చిమొద్దా! నీవు చెప్పింది బాగానే వుంది. కుంచం మన ఇంట్లో లేదుకదా! కుంచంతో కొలవగల ధాన్యం ఏనాడయినా మనకు వచ్చింది కనుకనా?" అన్నాడు ఆలీబాబా.

"ఎందుకంటే అంత కంగారు? నేను అంత వెర్రిదాన్నేంకాను. పొరుగింటికి వెళ్ళి కుంచం అడిగి తెస్తాను. ఈ విషయం నరమానవుడికి తెలియనివ్వను" అన్నది ధీమాగా. అప్పుడు ఆలీబాబా "సరే. కాని పొరుగిండ్లకు వెళ్ళి కుంచం అడిగితే, వాళ్ళు అనుమానించే అవకాశం వుంది. అందుకని మా అన్న కాశీం ఇంటికి వెళ్ళు. మా వదినను అడిగి కుంచం తీసుకురా! ఎలా అయినావాళ్ళు మన ఇంటివాళ్ళుకదా!" అని అన్నాడు.

## కాశీం భార్య అసూయ

అలాగేనని ఆలీబాబా భార్య తోటికోడలు ఇంటికి వెళ్ళి "అక్కా! మీ కుంచం ఒకసారి ఇస్తావా? మళ్ళీ వెంటనే తెచ్చిస్తాను"- అని అన్నది.

తోటికోడలు వచ్చి అలా అడగ్గానే దుష్టురాలైన కాశింభార్య మనస్సులో అనుమానం పుట్టుకొచ్చింది. "వీళ్ళు ఏ పూటకు ఆ పూట తిండి గింజలు తెచ్చుకుని తినేవాళ్ళు. అలాంటిది ఈ రాత్రివేళ కుంచం ఎందుకు వీళ్ళకక్కావలసి వచ్చింది? దాంతో ధాన్యం కొలుస్తారా? నూకలు కొలుస్తారా? కుంచాలతో కొలవదగిన ధాన్యం, నూకలు వీరికెక్కడున్నాయి? మరేం కొలుస్తారబ్బా? మొత్తానికి ఏదోకథ వుంది." అని మనస్సులో అనుకుంటూ ఇంట్లోకివెళ్ళి కుంచంలోపల మట్టుకు ఏదో చిల్లి వున్నట్లుగా కాస్త మైనం పెట్టి తెచ్చి ఆలీబాబా



భార్యకు ఇచ్చింది. "ఇదిగోనమ్మా, కుంచం వెదకడం కాస్తఆలస్యమైనది నీ పని అయిపోగానే మరిచిపోకుండా వెంటనే తెచ్చివ్వమ్మ. ప్రొద్దున్నే నాకు పని వుంటుంది కుంచంతో. మీ బావగారు చిర్రుబుర్రులాడుతూ నామీద విరుచకపడ తారు."— అన్నది నాగరికంగా.

"సరేనక్కా! పెద్ద పనేమీకాదు. వెంటనే తెచ్చిస్తాను"— అంటూ కుంచం తీసుకుని వెళ్ళింది ఆలీబాబా భార్య. ఆమె వెళ్ళేసరికి ఆలీబాబా, తన ఇంట్లో ఒక మూల పెద్దగొయ్యి తవ్వి, భార్య రాకకోసం ఎదురుచూస్తున్నాడు. ఆమె వచ్చి కుంచంతో బంగారు నాణాలు కొలిచి ఇస్తుంటే, ఆలీబాబా వాటిని పాతరలో పోస్తూ లెక్కపెట్టాడు. యాభై కుంచాల నాణాలు అయినాయి. ఇంకా ఒక అరకుంచం బంగారునాణాలు మిగిలిఉన్నాయి.

"ఏమయ్యా! ఇన్నేళ్ళుగా పుట్టి బుద్ధిఎరిగి మనం కడుపునిండా కమ్మని తిండితిని ఎరగం. మంచిబట్ట కట్టి ఎరగం. ఇక వంటిమీద బంగారపు సొమ్ములు లేనేలేవు. ఈ కాసిని బంగారునాణాలు మన ఖర్చుకు ఉంచుకుందాం. రేపైనా పట్నం వెళ్ళి నాకూ, మీకూ మంచి బట్టలు, ఇంటిలోకి సామానులు కొనుక్కు రండి"— అన్నది ఆలీబాబా భార్య, ఎంతో ఆశగా.

ఆలీబాబా విన్నాడు. అవును. నిజమే. తాను ఏనాడూ భార్యను సుఖ పెట్టలేదు. తనూ సుఖపడలేదు. అనుకోకుండా భగవంతుడు ఈ ధనం ఇచ్చాడు. భార్యకోరిక తీరుద్దాం- అనుకున్నాడు ఆలీబాబా. పాతరలో మట్టిపోసి పూడ్చివేసి.

చదును చేశారు ఇద్దరూ. మిగిలిన అరకుంచం బంగారు నాణాలు ఒక పాతగుడ్డలో మూటకట్టి దాచిపెట్టారు.

కుంచం తెచ్చింది లగాయితూ తోటికోడలు ఏ క్షణాన వచ్చి అడుగుతుందో అని ఆలీబాబా భార్యకు గుండెల్లో దడగానే వుంది. అంచేత పనిపూర్తి కాగానే కుంచం తీసుకుని వెళ్ళి తోటికోడలుకు ఇచ్చి "అక్కా! కుంచం ఇచ్చానమ్మా. చూసుకో, జాగ్రత్త!" అని ఇంటికి వచ్చేసింది.



కాశీం భార్య అఖండురాలు. ఆవులిస్తే పేగులు లెక్కపెడుతుంది. కుంచం ఇచ్చేటప్పుడు లోపలి మట్టుకు మైనం పెట్టింది దేనికి? తన తోటికోడలు ఆ కుంచంతో ఏం కొలిచిందీ తెలుస్తుందనే ఆలోచనతో తెలివిగా ఆమె ఆ పని

చేసింది. అయితే, వెర్రిబాగుల్ది ఆలీబాబా భార్య. ఈ విషయం ఆలోచించనేలేదు. కుంచం లోపలమట్టుకు మైనం ఉన్న సంగతి ఆమెగాని, ఆలీబాబాగాని గమనించ లేదు. బంగారు నాణేలు కొలిచేటప్పుడు ఆ మైనానికి ఒక బంగారు నాణెం అతుక్కున్నది. అది గమనించకుండా ఆలీబాబా భార్య అలాగే కుంచం తీసుకునివెళ్ళి, తోటికోడలికి ఇచ్చింది.

కాశీం భార్య ఆ కుంచాన్ని అటుఇటు తిప్పి చూసింది. కుంచంలోపల తానుపెట్టిన మైనానికి ఒక బంగారునాణెం అతుక్కుని తళతళలాడుతూ కనిపించే సరికి ఆమె గుండెలు గుభిల్లుమన్నాయి! "ఏమిటబ్బా ఇది? ఆశ్చర్యంగా ఉందే! నిన్నటివరకూ గంజిలోకి ఉప్పుగల్లు కూడా గతిలేని నా మరిదిగారికి బంగారు నాణేలా? చిత్రంగా ఉంది. వాటిని కుంచాలతో కొలవడమా? అమ్మో! అంత ధనం వచ్చిపడిందీ అంటె, వాళ్ళు మాకంటె చాలా ధనవంతులైనారన్నమాట! వంటిమీద సరయిన గుడ్డకూడా నోచుకోని నా తోటికోడలు ఇక, బంగారం వంటినిండా దిగేసుకుంటుందన్నమాట!" అని కడుపుమండినట్లుగా అసూయ పడసాగింది కాశీం భార్య.

మరునాడు తెల్లవారిన తరువాత ఆలీబాబా మామూలుగా నిద్రలేచి కాలకృత్యాలు ముగించుకుని, రాత్రి మూటకట్టి దాచిన బంగారు నాణాల్లో కొన్ని నాణాలు తీసుకుని భార్యతో చెప్పి, దగ్గరలో ఉన్న పెద్ద పట్నానికి వెళ్ళాడు. అక్కడ సంతకు వెళ్ళి ఇంటిలోకి కావలసిన రకరకాల వస్తువులు, సామానులు

దండిగాకొని బండిమీద వేసుకొని సాయంత్రానికి ఇల్లుచేరాడు. ఆలీబాబా ఇంటి వద్ద ఎక్కడాలేని సామగ్రితో బండివచ్చి ఆగడం కాశింభార్య చూసింది. ఆమె కళ్ళు మండిపోయాయి. "అమ్మో ఎన్ని సామానులు, ఎన్ని సామానులు! నేననుకున్నది అక్షరాల నిజం. ఆలీబాబా ఎక్కడో బంగారపు నిధి కొల్లగొట్టుకుని వచ్చాడు!" అనుకుంటూ ఇంటిలోకి వెళ్ళింది. ఆమెకు అన్నం తినబుద్ధి పుట్టలేదు. కంటిమీద కునుకు పట్టలేదు. ఆరాత్రి భర్త కాశిం దగ్గరకూచుని "ఏవయ్యా, చూశావా, ఏం జరిగిందో!" అని అన్నది.

"అదేగా! నా తమ్ముడి ఇల్లు ఇవాళ కళకళలాడుతున్నది. ఇంట్లోకి బోలెడు సామానులు తెచ్చాడు. వాడిభార్య ఎన్నడూ లేనిది కళ్ళు జిగేల్మనే బట్టలు కట్టుకున్నది." అన్నాడు కాశిం.

"అదే నేనూ చెప్పేది! నిన్నటిదాకా కటికదరిద్రం అనుభవించిన మీ తమ్ముడు తెల్లవారేసరికల్లా మహా ధనికుడు ఎలా అయ్యాడు? ఏమిటా రహస్యం? మనకూ బోలెడు డబ్బుంది. ఎన్నో వ్యాపారాలు చేస్తున్నారు మీరు. కాని, మీ తమ్ముడు కుంచాలతో బంగారు నాణాలు కొలిచే స్థితికి ఎదిగిపోయాడు. ఇక మీ తమ్ముడి ముందు మీరు దిగదుడుపే. మీ తమ్ముడి భార్యకూ్కడా ఇకమీదట నేను చులకనై పోతాను. మనం అంటె వాళ్ళకు ఒకలెక్కలో వుండం. నా మాటవిని, మెల్లగా మీ తమ్ముడ్ని అడిగి తెలుసుకోండి, ఏం జరిగిందో. మీరు అడిగితే చెపుతాడు. రోజూ అడవికి పోయి కట్టెలుకొట్టి తెస్తుంటాడుకదా! అక్కడేమయినా

లంకె బిందెలు దొరికాయేమో! లేక ఏ దేవతయినా ప్రత్యక్షమై ధనం ఇచ్చిందేమో! తెలుస్తుంది. మీరూ అడవికిపోయి, అలాగే ధనం సంపాదించవచ్చు" అని శతవిధాలా నూరిపోసింది.

కాశింకు భార్య మాటలు బాగా తలకెక్కాయి. స్వతహాగా తమ్ముడంటే ప్రేమ, అభిమానంలేని కాశిం అతని అభ్యున్నతికి మరీ అసూయ చెందాడు. తనకూ, తన భార్యకు గౌరవం తగ్గిపోతుందని అనుకున్నాడు. హఠాత్తుగా ఇంతటి ఐశ్వర్యం ఎలా లభించిందో, ఆ రహస్యం ఏమిటో తమ్ముడ్ని అడిగి తెలుసుకోవాలని నిశ్చయించుకున్నాడు. అంతే!

ఆ మరునాడే కాశిం, అలీబాబా ఇంటికి వెళ్ళాడు. ఎన్నడూరాని అన్నగారు ఇవాళ అనుకోకుండా తన గడపలో అడుగు పెట్టినందుకు అమాయకుడైన అలీబాబా పొంగిపోయాడు. మంచం వాల్చి కూచోమన్నాడు. అలీబాబా భార్య కూడా బావగారి రాకకు సంతోషించింది. మంచినీళ్లు తెచ్చియిచ్చి మర్యాదలు చేసింది.

"అన్నయ్యా, బాగున్నావా? వదినె, పిల్లలు అందరూ కులాసాయే కదా? నీ వ్యాపారాలు బాగా సాగుతున్నాయా? ఏమిటీ విశేషాలు?" అని ఆప్యాయతతో పలకరిస్తూ, యోగ క్షేమాలు విచారించాడు.



కాశీం పైకి లేనిపోని ప్రేమాభిమానాలు నటిస్తూ, "అల్లా దయవల్ల అందరం బాగున్నాం తమ్ముడూ! నీవు, మరదలూ, ఖుషీగా ఉన్నారు. ఇక్కడికి నేను రాకపోయినా, నీగురించీ, నీ కుటుంబాన్ని గురించి మీ వదిన్నూ, ఇరుగు-పొరుగువారినీ అడిగి తెలుసుకుంటూనే ఉన్నాను. ఎక్కడరా తమ్ముడూ?—బోలెడన్ని వ్యాపారాలు! పేరేకాని, పెట్టిన డబ్బుకు తగిన లాభాలు లేవురా! ఏంచేస్తాం? దిగిన తరువాత అవస్థ పడక తప్పదు. క్షణం తీరికలేదు. ఊపిరాడని పని. శ్రమ ఎక్కువ, ఫలితం తక్కువ!"— అన్నాడు.

"అవునన్నయ్యా! కాలం మారిపోయింది. వెనకటి రోజులు కావు ఇవి. ఎవరి జాగ్రత్తలో వారు ఉండాల్సిన కాలం" అన్నాడు వెర్రిబాగులవాడైన ఆలీబాబా.

"అవున్రా! అందుకే ఇప్పుడు నేను ఇక్కడికి వచ్చింది. ఊళ్ళో దొంగలబాధ ఎక్కువగా ఉందట. అందరూ చెప్పుకుంటున్నారు. నీవు జాగ్రత్తగా ఉండాలిరా. తీసుకొచ్చిన బంగారం అంతా భద్రంగా దాచావా లేదా? నీవు తెలివి తక్కువవాడివి. నీకిది చెప్పాలనే వచ్చాను. ఏ మాత్రం అజాగ్రత్తగా ఉన్నా వచ్చింది వచ్చినట్లే పోతుంది సుమా!"... అని బోధించాడు కాశీం, హితవు చెప్తున్నట్లుగా.

ఆ మాట విని ఆలీబాబా ఆశ్చర్యచకితుడైనాడు. తనకు బంగారం దొరికిన సంగతి అన్నకు ఎలా తెలిసిందా అనుకున్నాడు. వెంటనే "అదేమిటి అన్నయ్యా? బంగారం ఏమిటి? నాకేమిటి, బంగారం దొరకడమేమిటి? నాకుఅంత అదృష్టమా అన్నయ్యా?" అని తడబడుతూ చెప్పాడు ఆలీబాబా.

వెంటనే కాశీం కోపం తెచ్చుకొని "ఏమిట్రా, నా దగ్గరే వేషాలు వేస్తున్నావు? నాకు అంతాతెలుసు. నిన్న నీ పెళ్ళాం కుంచం తీసుకెళ్ళింది. బంగారు నాణాలు కొలవడానికి కదూ? కుంచం అడుగున చిల్లి ఉంటే మైనం పెట్టిందట మీ వదినె. తీరా తిరిగి ఇచ్చినప్పుడు చూస్తే, ఆ మైనానికి ఒక బంగారు నాణెం అతు

క్కని ఉంది. మీ వదినె చెప్పింది. ఇంతకన్నా సాక్ష్యం ఏం కావాలి? ఊరికే బుకాయించకు. నీ ఇల్లంతా రకరకాల సామాగ్రితో నిండిపోయిందే! ఎక్కడ నుంచి వచ్చాయి అవన్నీ? నాకెందుకురా? నీకు బంగారంవస్తే ఎవరికొక్కావాలి? రత్నాలు వస్తే ఎవరిక్కావాలి. తమ్ముడివి. తెలివిలేనివాడివి. చిక్కులలో పడతావని ఇంతా చెప్పాను. బంగారం ఎలా దొరికిందో నాకైనా చెపుతావేమో ఏదైనా సహాయం చేద్దామనుకున్నాను. నీకిష్టం లేకపోతే ఆ రహస్యం నాకు చెప్పకు. కాని ఒక విషయం గుర్తుంచుకో. దొంగలకు తెలిస్తే నీ ప్రాణాలు తీసి ఆ బంగారం పట్టుకుపోతారు!"... అన్నాడు బెదిరిస్తూ.

అన్నమాటలకు ఆలీబాబా ఉలిక్కిపడ్డాడు. "దొంగలు" అనేమాట పదేపదే చెవిన పడుతుంటే అతని గుండెలు గుభిల్లుమంటున్నాయి. అసలువిషయం అన్నకు తెలియడమే మంచిదనుకున్నాడు.

"లేదన్నయ్యా! విషయం నీకు చెప్పకుండా ఇంకెవరికి చెపుతాను? ఎంత చెడ్డా ఒక తల్లి కడుపున పుట్టినవాళ్ళం. ఏ ఆపదవచ్చినా, మనం మనం సహాయం చేసుకోవాలి కాని, మరెవరొస్తారు"అంటూ ఆలీబాబా, తానుకట్టెలకోసం వెళ్ళినపుడు అడవిలో కొండగుహ దగ్గరికి దొంగలముఠా రావడం, గుహతలుపులు తెరుచుకోడం, వాళ్లు వెళ్ళిపోయిన తరువాత తాను మోయగలిగినంత బంగారం గాడిదపై

వేసుకుని ఇంటికి రావడం. మొదలయిన కథంతా పూసగుచ్చినట్లు అన్నకు చెప్పాడు.



## కాశీం హత్య



కాశీంకు విషయం తెలిసిపోయింది. "తమ్ముడూ! నాకు నిజంచెప్పావు. సంతోషం! కాని, ఆ దొంగలు సామాన్యులు కారు. కటికవాళ్లు. జాగ్రత్తగా ఉండు" అని ఎంతో మేలు కోరుతున్నవాడిలా బోధించి వెళ్ళిపోయాడు.



తరువాత తన పెళ్ళానికి ఈ విషయం చెప్పాడు. ఆమె ఆశ్చర్యానికి అంతులేదు. "ఆలీబాబాలాగే మీరూ అడవికిపోయి, మన గాడిదలు మోయగలిగినంత బంగారం దొంగిలించుకు రమ్మని" భర్తను పురిగొల్పింది. ఇంకేం ఆ రాత్రి ప్రొద్దుపోయిన తరువాత కాశీం కొన్ని గాడిదలను తోలుకుని, తమ్ముడు చెప్పిన మార్గం గుర్తుపెట్టుకుని అడవికి వెళ్ళాడు. తెల్లవారేసరికి కొండగుహ వద్దకు చేరుకున్నాడు. ఆలీబాబా చెప్పిన మాటలు గుర్తుకు తెచ్చుకొని "భీభీ భీగం రాస్తా ఛోడో" అని మూడుసార్లు అని, గుహ ద్వారంపై చేత్తో తట్టాడు. గుహద్వారం తెరుచుకున్నది. కాశీం గబగబా లోపలికి వెళ్ళాడు. "భీభీ భీగం రాస్తాబంద్" అన్నాడు. వెంటనే గుహ తలుపులు మూసుకున్నాయి. కాశీం గుహ లోపలిభాగంలోకి వెళ్ళి చూచాడు. అతనికి కళ్లు చెదిరాయి. అంతులేని ధనరాసులు. వెండి,

బంగారు నగలు, నాణాలు. అమూల్యమైన రత్నాలు కనిపించాయి. అతని ఆనందా నికి అంతులేదు. కళ్లు ఇంతింత చేసుకుని ఆ ధనరాసులవంక అదేపనిగాచూసాడు. “నా అదృష్టం పండింది. నా తమ్ముడు ఆలీబాబా తీసుకుపోయిన బంగారునాణాలు చాలాకొద్ది. వాడికి ఉన్నది ఒక్కటే గాడిద. నేను ఎన్నో గాడిదలను తోలుకుని వచ్చాను. అవి మోసినంత ధనం సంచులలో పోసుకుని తీసుకపోతాను. దొంగలు అడ్డం వస్తారా?— చూస్తాను. నాక్రింద బోలెడంతమంది జనంఉన్నారు. వాళ్ళతో వచ్చి దొంగలందర్నీ ఖతం చేస్తాను. ఈ ధనరాసులన్నీ పూర్తిగా నా స్వాధీనం



చేసుకుంటాను." అని మనస్సులో అనుకుంటూ ఒక తియ్యటి కలకంటున్నట్లుగా పొంగిపోయాడు. సంచులలోకి బంగారం నాణాలు పోగుచేశాడు. మూతులు బిగించాడు. వాటిని బలమంతా ఉపయోగించి ఈడ్చుకుంటూ గుహద్వారం దగ్గరికి తీసుకుని వచ్చాడు. కాని ఇప్పుడతనికి మనస్సు మనస్సులోలేదు. అంతులేని ధనం దొరికిందన్న ఆనందంలో తాను ఎక్కడున్నదీ, ఏం చేస్తున్నదీ కూడా అతనికి తెలియలేదు. ఏ మాటంటె గుహద్వారం తెరుచుకుంటుందో ఎంతసేపటికి గుర్తు రాలేదు. ఎంతో ఆలోచించాడు. ఉహూఁ! జ్ఞాపకం రాలేదు. కాశీంకు గుండెల్లో దడ బయలుదేరింది. ఇప్పుడు బయటికి ఎలా వెళ్ళాలి. గుహ ద్వారం మూసుకొని పోయింది. అది తెరుచుకోడానికి వేరే మార్గంలేదు. తలుపులు తెరుచుకోనిదే తాను బయటపడలేడు. గుహద్వారాన్ని గట్టిగా తన్నాడు. బలంకొద్దీ పట్టుకుని అటు-ఇటు కదల్చడానికి ప్రయత్నించాడు. కాని ఎన్ని చేసినా ద్వారం తెరుచుకోలేదు. ఏమాట అంటె అది తెరుచుకుంటుందో తలబ్రద్దలు కొట్టుకున్నా జ్ఞాపకం రాలేదు అతనికి. గంటలు గడిచిపోతున్నాయి. ఇంత ఆలస్యమైందే! ఏ క్షణంలో దొంగలు వచ్చి పడతారో! ఈ గుహలో తాను వారికంట బడితే తనను ప్రాణాలతో బ్రతకనిస్తారా?—ఇలా ఆలోచించినకొద్దీ కాశీంకు భయం ఎక్కువైంది. వణుకు పుట్టింది. "అయ్యో! దురాశ దుఃఖంచేటు అంటారు ఇదే. ఇప్పుడు నాకు కావలసినంత సంపద వుంది. దాంతో తృప్తిపడక ఈ ధనంకోసం ఎందుకు ఆశపడ్డాను? ఆడదాని మాటలు విని ఇక్కడకి ఎందుకు వచ్చాను! ఇదంతా నా దురదృష్టం"—అని కాశీం విచారించసాగాడు.

చీకటి పడింది. అరణ్యప్రాంతం అంతా గాఢాంధకారం అలముకుని, అసలే భయంకరమయిన అడవి మరింత భయానకంగా ఉంది. నలభైమంది దొంగలమూతా గుర్రాలమీద దౌడు తీస్తూ అక్కడకి వచ్చింది. తాము దోచుకుని వచ్చిన ధనం మూటలు భుజాన వేసుకొని కాగడాలు వెలిగించారు. దొంగలనాయకుడు మామూలుగా "సంకేతపదాలు" ఉచ్చరించగానే గుహద్వారం తెరుచుకున్నది. ఒక్కొక్కరే గుహలో ప్రవేశించారు. అయితే, లోపల అడుగుపెట్టగానే గుహ ద్వారం వద్దకు ఈడ్చుకుని వచ్చి వరుసగా పెట్టివుంచిన ధనం సంచులు కనిపించ గానే మూతా నాయకుడు చటుక్కుని ఆగిపోయాడు. "ఏమిటిది?" అని గర్జించాడు కళ్ళెర్రచేస్తూ. "ఎవడో మన రహస్యం కనిపెట్టేశాడు. ఎవడో ఈ గుహలో ప్రవేశించి మన కష్టార్జితమైన ధనాన్ని దొంగిలించడానికి ప్రయత్నించాడు. ఎవడువాడు? మన రహస్య స్థావరం, మన "సాంకేతిక పదాలు" వాడికి ఎలా తెలిశాయి?"—అన్నాడు బిగ్గరగా. తక్కిన దొంగలు బదులు చెప్పలేక తలలువాల్చి నిలిచి ఉన్నారు. చివరకు వారిలో ఒకడు "ఎవడో దారినపోతూ మన స్థావరం చూచి వుంటాడు, మన "సంకేతపదాలు" వినివుంటాడు దొరా!" అని చెప్పాడు.

"గుహ అంతా వెదకండి! ఎవడైనా లోపల ఉన్నాడేమో!" అన్నాడు దొంగల నాయకుడు మళ్ళీ. వెంటనే దొంగలు కాగాడాల వెలుతురులో గుహఅంతా వెదికారు. ఒకమూల ధనం సంచి వెనకాల నక్కివున్న కాశీం వారి కంటపడ్డాడు! అంతే కాశీంను తలా ఒకతన్ను తన్నారు. దొంగలనాయకుడయితే అతన్ని బండ

బూతులుతిడుతూ క్రిందపడవేసి, కాళ్ళతోతంతూ దొర్లించాడు. "ఈ ద్రోహిని ఖండ ఖండాలుగా నరికి పారెయ్యండి. పీడా వదులుతుంది." అన్నాడు నాయకుడు.



"పొరపాటైంది! పిల్లలుగలవాడ్ని రక్షించండి. నా ప్రాణాలు తీయకండి!"— అని కాశీం ఎంత మొత్తుకుంటున్నా వినకుండా కసాయి వాళ్ళయిన ఆ దొంగలు కాశీంను కత్తితో పొడిచి చంపివేశారు. అప్పుడు దొంగల నాయకుడు వికటంగా నవ్వుతూ "మన శత్రువును ఖతం చేశాం. వీడికితెలిసిన మన రహస్యం

వీడితోనే అంతమైపోయింది. ఇక భయంలేదు. మనం అదృష్టవంతులం. "అల్లా" మన పక్షన వున్నాడు. అందుకే మనసొమ్ముపోలేదు." అని సంతృప్తి వ్యక్తం చేసాడు.

తరువాత నాయకుడి ఆజ్ఞప్రకారం దొంగలు కాశిం తలనరికి, ఆ తల, మొండెం గుహలో ఒకమూల వ్రేలాడగట్టారు.

తరువాత దొంగలందరూ గుంపుగా కూచున్నారు. వారిమధ్యలో నాయకుడు కూచున్నాడు. ఆనందంగా అందరూ తోలుసంచుల్లోఉన్న మద్యం తాగారు. మాంసం తిన్నారు. ఆ కొత్తవాడు తమ రహస్యగుహలో ఎలా ప్రవేశించాడా అని దొంగలందరూ చర్చించారు. కొంతసేపు చర్చ కొనసాగింది.

"ఏమైనా సొమ్ముపోలేదు. మనది కష్టార్జితం. దొంగతనంతో మనం సంపాదించిందే కావచ్చు ఈ ధనం. అయినా మనం ఎన్నెన్ని ప్రమాదాలు ఎదుర్కొన్నాం? ఎన్నెన్ని కష్టాలు పడ్డాం? ప్రాణాలను సయితం లెక్కచెయ్యకుండా మనం ఈ ధనం దేశదేశాలలో దోచుకుని వచ్చాం. అందుకే మన శ్రమ ఫలం వృధాగాపోలేదు. పైగా మనరహస్యం తెలుసుకున్న శత్రువును మట్టుపెట్టాం!"...అంటూ దొంగలనాయకుడు పెద్ద ఉపన్యాసం ఇచ్చాడు. దొంగలంతా అతని ప్రసంగం విని నాయకుడ్ని అభినందించారు. ఆ తరువాత దొంగలందరూ

గుహనుండి బయటికి వచ్చారు. గుహద్వారాన్ని మూసి, గుర్రాలు ఎక్కారు. మళ్ళీ దోపిడీలు చేయడానికి బయలుదేరి ఎక్కడికో వెళ్ళిపోయారు.

తెల్లగా తెల్లవారింది. చాలా ప్రొద్దెక్కింది. నిన్న అనగా అడవికి వెళ్ళిన కాశీం ఇల్లుచేరలేదు. కాశీం భార్య ఆందోళన చెందింది. "అయ్యో! ధనముపై ఆశతో నా భర్తను పురికొల్పాను. గాడిదల్ని తోలుకుని అడవికి పోయిన మనిషి, తెల్లవారి ప్రొద్దెక్కినా రాలేదు. అల్లా! ఆయనకు ఏం ప్రమాదం సంభవించిందో కదా!" అంటూ తనలోతాను ఎంతోసేపువిచారించింది. ఆమెమనస్సు పరిపరి విధాల పోతున్నది. కీడును శంకిస్తున్నది. అయితే, ఏం చేస్తుంది? ఈ విషయము ఇతరులకు చెప్పేదికాదు. చివరకు తనమరిది ఆలీబాబాతో చెప్పి, అతని సహాయాన్ని కోరాలని నిశ్చయించుకున్నది. ఎందుచేతనంటె మొదట అడవికి వెళ్ళి ధనం తెచ్చింది అతనేకదా! కాబట్టి అడవికి అతనే వెళ్ళగలడు. పైగా ఆలీబాబా నమ్మకమైనవాడు. మంచివాడు. అన్నపై ప్రేమగలవాడు. ఈ ఆపత్సమయములో "అతనుతప్ప వేరే దిక్కులేదు"—అని నిర్ధారించుకుని కాశీం భార్య, దుఃఖిస్తూ ఆలీబాబా ఇంటికి వెళ్ళింది. ఎన్నడూ గడపలోకి అడుగుపెట్టని తోటి కోడలు రావడం చూచి ఆలీబాబాభార్య ఆశ్చర్యపోయింది. అలాగే వదినె రావడం చూచి ఆలీబాబా కూడా చకితుడైనాడు. వారిద్దరూ ఆమెను ప్రేమతో ఆహ్వానించి కూచోపెట్టి మర్యాదచేశారు.

# కాశీం భార్య దుఃఖం

"వదినా? ఏమిటిలా వచ్చావు? ఏమైనా అవసరమైన పని వచ్చిందా? అన్నయ్య పంపాడా నిన్ను?" అని గబగబా అడిగాడు.

"ఏం చెప్పేది నాయనా? పాపిష్టిదాన్ని దొంగల ఆచూకీని గురించి, ధనం లభించిన తీరును గురించి నీవు మీ అన్నకు చెప్పావు కదా! దొరికినంత ధనం తీసుకుని రమ్మని నేనే మీ అన్నను పురికొల్పానయ్యా! ఆయన గాడిదల్ని తోలుకుని ఉన్న ఉదయం అడవికి వెళ్ళాడు. ఇంతవరకూ తిరిగిరాలేదు. నాకేదో భయంగా ఉంది. మనస్సు కీడు శంకిస్తున్నది. అన్నీ అపశకునాలే నాకంట పడు తున్నాయి. నీవే అడవికివెళ్ళి మీ అన్నకు ఏమైందో తెలుసుకునిరా నాయనా! ఎంత చెడ్డా మీరిద్దరూ ఒకతల్లి కడుపున పుట్టినబిడ్డలు. నేను పరాయిదాన్ని. నే నంటె నీకు ఇష్టంలేకపోయినా నీతోడ బుట్టిన వాడికోసం ఈ సహాయం చెయ్యి బాబూ!" అంటూ బావురుమని ఏడ్చింది.

అసలే దయార్ద్రహృదయుడైన ఆలీబాబా వదినెగారు ఇలా చెప్పి, దుఃఖించగానే ఉండబట్టలేక తనూకూడా ఏడ్చాడు. అప్పుడు ఆలీబాబా భార్య ఇద్దర్నీ ఓదార్చింది. "అదేమిటి అక్కా! కష్టాలు ఎవరికైనా వస్తాయి. దీనికోసం ఇంత గాభరా పడాలా? మీమరిది వెంటనే అడవికిపోయి విషయం ఏమిటో తెలుసు

కుని వస్తాడు. బావగార్ని వెంటపెట్టుకుని క్షేమంగా తీసుకుని వస్తాడు"— అని ధైర్యం చెప్పింది. అలీబాబా తమాయించుకుని "వదినా! ఏడవకు. నీవుఏడుస్తుంటె నలుగురూ పోగవుతారు. తలా ఒకమాట అడుగుతారు. అందరికీ విషయం తెలిసి పోతుంది. ఇది ప్రమాదకరమైన విషయం. ప్రాణంమీదికి వస్తుంది. ఆ దొంగలు కసాయివాళ్ళు. నేను మొదటినుంచీ అనుమానిస్తూనే ఉన్నాను, ఏం కొంపమునుగుతుందో అని— చివరకు అనుకున్నట్టే జరిగింది."— అని ఓదార్చి పంపివేశాడు.

అలీబాబా రోజులాగానే ఆరోజుకూడా గాడిదను తోలుకొని కట్టెలకోసం అడవికి వెళ్ళాడు. దొంగలగుహ వున్నచోటుకు చేరుకున్నాడు. ఆ ప్రాంతం అంతా వెదికి చూచాడు. కొంతదూరాన అడవిలో అన్నగారి గాడిదలు గడ్డిమేస్తూ కనిపించాయి. అలీబాబా గుండెలలో రాయిపడినట్లయింది. గాడిదలు విడిగా తిరుగుతున్నాయి. అన్నజాడ కనిపించలేదు. అన్నకు ఏదో ప్రమాదం జరిగివుంటుందని అనిపించింది అతనికి. భయపడ్తూ గుహద్వారం వద్దకువెళ్ళి "మంత్రం" మూడుసార్లు పలికి తలుపుతట్టాడు. తలుపులు తెరుచుకున్నాయి. గుహలోకివెళ్ళిచూచాడు. అంతటా నెత్తురు మరకలు కనిపించాయి. గుండె గుబగుబలాడ్తూ వుండగా ఇంకా లోపలికి వెళ్ళిచూచాడు. ఇంకేముంది? అన్నగారి తల మొండెం ఒకమూల వ్రేలాడగట్టి వుండడం అతని కంటపడింది. నిలువునా నీరైపోయాడు. ఒక్కసారి దుఃఖంపొంగి

వచ్చింది. అయినా తమాయించుకుని, ఇక అక్కడ వుండడం ప్రమాదమని గ్రహించాడు. అన్నతల, మొండెం సంచులలో మూటకట్టి, కొన్ని బంగారు నాణాలు, కొంతధనం మరోమూటకట్టి గుహ బయటకె ఈడ్చుకుని వచ్చి గాడిదపై వేశాడు. తరువాత మంత్ర వాక్యాలతో గుహద్వారం మూసివేసి ఆ రాత్రి చీకటి పడేవేళకు ఇల్లు చేరాడు. బంగారం జాగ్రత్తగా తన యింట్లో భద్రపరిచాడు.



తరువాత ఆలీబాబా, తన అన్నగారింట్లో పనిచేస్తున్న దాసీని రహస్యముగా పిలిపించాడు. ఆమె పేరు మార్జియానా. మనిషి చాలా మంచిది. చాలా

తెలివయిన పిల్ల. ఎంతో కాలంగా అన్న కాశీం ఇంట్లో నమ్మకంగా పనిచేస్తూ ఆ కుటుంబానికి మిక్కిలి విధేయురాలుగా వుంటున్నది. బేగం మార్జియానాను దగ్గర కూచోబెట్టుకుని నెమ్మదిగా ఇలా చెప్పాడు.

"చూడు మార్జియానా! నీకు ఒక పరమ రహస్యం చెపుతున్నాను. జాగ్రత్తగా విను. ఈ విషయం నీవు ఎవరికీ చెప్పకూడదు. ప్రాణం పోయినాసరే ఈ విషయం మరెవరి చెవినా పడకూడదు. పొరపాటున ఎక్కడైనా నోరు జారావా నీకూ, నాకే కాదు. ఇంత కాలం నీకు అన్నంపెట్టి పోషించిన మా అన్నకుటుంబానికి కూడా ప్రమాదం వస్తుంది."



అదివిని మార్జియానా "అలాగే మావా! నా సంగతి మీకు తెలియనిది కాదుగా! ఎన్నో ఏళ్ళుగా మీరంతా చూస్తున్నారు. చిన్నప్పటి నుంచీ నేను ఇక్కడే పెరిగాను. ఏనాడైనా మీ కుటుంబ విషయాలు బయటికి రానిచ్చానా?"— అన్నది.

"నాకు తెలుసు మార్జియానా! అందుకే నీకు చెపుతున్నాను. మా కుటుంబాన్ని కాపాడవలసిన భారం నీమీద పెడుతున్నాను. ఏంలేదు... అడవిలో ఒక రహస్యగుహలో ఎవరో కొంచరు దొంగలు తాము దోపిడీచేసి తెచ్చుకున్న ధనం, బంగారం, నాణాలు దాచుకున్నారు. ఆ ధనం కాజెయ్యాలన్న ఆశతో మా అన్న కాశీం అక్కడికి వెళ్ళి ఆ దొంగల చేతులలో చిక్కాడు. వాళ్ళు ఆయన్ను చంపి తల, మొండెం వేరుచేసి ఒకచోట వ్రేలాడగట్టారు. నేను మామూలుగా కట్టెలకోసం అడవికిపోయి ఈ ఘోరం చూచాను. మా అన్న శవాన్ని ఉన్న పళంగా మూటకట్టి తెచ్చాను. ఈ విషయం మా వదినెకు చెపితే, ఆమె గుండె పగిలి పడిపోతుంది. అంతా గొల్లుమంటారు. అందాక నీవు ఎలాగయినా మా వదినకు నచ్చచెప్పి, ఆమె ధైర్యంగా ఈ దుఃఖాన్ని దిగమ్రింగేలా చెయ్యాలి. అంతే కాకుండా ఈ రహస్యం బయటికి పొక్కకుండా చేయాలి. మా అన్న ఈ విధంగా చనిపోయాడన్న విషయం ఎవరికీ తెలియకూడదు."— అని అంతా చెప్పాడు ఆలీబాబా.

మార్జియానా మొదట కొంచెం చకితురాలయినా పిమ్మట గుండె దిటవు చేసుకొని "అలాగేనండీ, నేను మీ వదినెకు నచ్చచెపుతాను. అయినా మీరు కావల

సిన వారు. మీరుకూడా ఆమెకు ధైర్యం చెప్పి, ఓదార్చడానికి ప్రయత్నించండి." అని పలికి ఆలీబాబాను, కాశీం తల, మొండాలు మూటకట్టివున్న గాడిదలను వెంట పెట్టుకుని కాశీం ఇంటికి వెళ్ళింది మార్జియానా.

దీనంగా వున్న ఆలీబాబా ముఖం చూడగానే కాశీం భార్యకు ఆందోళన ఎక్కువయింది.

"ఏం మరిదీ? మీ అన్న కనిపించాడా? వెంటపెట్టుకుని వచ్చావా? ఏ ప్రమాదం సంభవించలేదుకదా?" అని ఆతృతతో ప్రశ్నలవర్షం కురిపించింది.

## ఆలీబాబా ఉపాయం

"వదినా! కంగారు పడకు. ఏదీకూడా మనచేతులలో లేదు. అంతా 'అల్లా' అనుకున్నట్లు జరుగుతుంది. కాశీంభాయి ఇక మనకులేడు! ఆయన అల్లా దగ్గరికి వెళ్ళిపోయాడు. బంగారం, ధనం తెమ్మనమని నీవు అన్నను పంపావు. ఆయనకు అక్కడ ప్రమాదం వాటిల్లింది. దొంగలు అన్న ప్రాణాలు తీశారు. తల, మొండెం వేరుచేసి గుహలో వ్రేలాడగట్టారు. ఆ దృశ్యం నేను చూడలేక పోయాను. వాటిని గోనె సంచిలో మూటలుకట్టి గాడిదలపై వేసుకునివచ్చాను." అనిచెప్పి, ఆమెకు తల, మొండెం చూపించాడు ఆలీబాబా. తల బాదుకుంటూ వల వల ఏడ్చింది ఆమె. తన వల్లనే ఈ ఘోరం జరిగిపోయిందని, తన్ను తాను

నిందించుకుంటూ దుఃఖించింది. ఆలీబాబా, దాసీ మార్జియానా ఆమెను ఎన్నో విధాల ఓదార్చారు.



"వదినా! ఇప్పుడు ఏం అనుకున్నా ప్రయోజనంలేదు. అంతా జరిగిపోయింది. నీ మొగుడిమీద నీకు ఎంత ప్రేమవుందో, నా అన్నమీద నాకు అంతకంటె ఎక్కువ ప్రేమ వుంది. కాని, ఏం చేస్తాం? అయితే, నీకీ విషయం చెపుతాను విను- మనం బిగ్గరగా ఏడుస్తూ కూచుంటే ఈ విషయం అందరికీ తెలిసిపోతుంది. చివరకు ఆ దొంగవెధవలకు కూడా తెలుస్తుంది. వాళ్ళ మన ఊరువచ్చి, మనఇల్లు కనిపెట్టి మనందర్నీ కూడా హతమారుస్తారు. అంచాత మనం దుఃఖాన్ని దిగమ్రింగి, గుట్టు చప్పుడు కాకుండా అన్నయ్య శవాన్ని ఈ ఇంట్లోనే ఒకచోట

పాతిపెడదాం. ఇరుగుపొరుగువారు, బంధువులు, స్నేహితులు ఎవరయినా కాశీం ఏడని అడిగితే, హఠాత్తుగా గుండెజబ్బువచ్చి చనిపోయాడని చెప్పుదాము. అలా చేయకపోతే. మనందరమూ కూడా పెద్ద ఆపదలోపడి పోతాము. తరువాత అనుకుంటే లాభంలేదు."... అని కాశీం భార్యకు నచ్చచెప్పాడు అలీబాబా.

ఇంటిదాసి మార్జియానా కూడా కాశీం భార్యకు ఎన్నో విధాల బోధించి, ధైర్యం చెప్పింది. "అమ్మా! మీ మరిది అలీబాబాకు అన్నగారిపైగల అభిమానం వలననే మన యజమాని కళేబరాన్ని సాహసంచేసి తెచ్చాడు. నీ మరిది చెప్పిన సలహా బాగుంది. అలాచేస్తేనే మనందరికీ మేలు."— అని అన్నది.

కాశీం భార్యకు అలీబాబా మాటలు, మార్జియానా బోధలు నచ్చాయి. వారి చెప్పినట్లే నడచుకోవాలని నిశ్చయించుకున్నది.

'నాయనా అలీ! ఇదంతా నా తలరాత. ధనాశవలన నేనే చేజేతులా మీ అన్నను శాశ్వతంగా దూరం చేసుకున్నాను. ఇంక నీవు తప్ప నాకు దిక్కెవరు నాయనా? ఈ ఇంటి వ్యవహారాలన్నీ నీవేచూడు. నీవుచెప్పినట్లు నడచుకుంటాను.' అని అన్నది.

తరువాత దాసీ మార్జియానా, అలీబాబా వైద్యుడి ఇంటికి వెళ్ళి వస్తున్నట్లు నటించారు. కాశీంకు ఏదో జబ్బుచేసిందని ఇరుగు పొరుగు వారందరూ

నమ్మేలా ప్రవర్తించారు. ఎవరన్నా అడిగితే "ఏదో గుండెజబ్బుట! మాయదారి జబ్బు. ఎన్ని మందులు వాడినా తగ్గడంలేదు." అని ఆలీబాబా, మార్జియానా సమాధానం చెపుతూ వచ్చారు. తరువాత ఒకపూట ఆలీబాబా మారువేషం వేసుకుని ఒకదర్జీ వాడి దగ్గరికి వెళ్ళాడు. పది బంగారు నాణాలు ఇస్తాను, తాను చెప్పినట్లు చేస్తావా అని అడిగాడు. అంతధనం ఎన్నడూ ఎరగని దర్జీవాడు అలాగే చేస్తానని చెప్పాడు. అంతట ఆలీబాబా దర్జీవాడి కళ్ళకు గంతలు కట్టి, ఖాశీం ఇంటికి తీసుకుని వెళ్ళాడు. తరువాత అతని గంతలువిప్పి, తెగిపోయిన కాశీంతలను మొండాన్ని కలిపి కుట్టవలసినదిగా కోరాడు. మంచిపనివాడయిన ఆ దర్జీ, ధనంకోసం ఆశపడి అలాగే తలను మొండాన్ని కలిపి చక్కగా కుట్లువేసి అతికినట్లు చేశాడు. పనిపూర్తి కాగానే ఆలీబాబా దర్జీకి బంగారునాణాలు ఇచ్చి మళ్ళీ అతని కళ్ళకు గంతలు కట్టి తీసుకునిపోయి, అతని ఇంటిదగ్గర వదిలిపెట్టాడు.

కాశీం శవాన్ని ఒక మంచంమీద పడుకోపెట్టి గుడ్డకప్పారు. ఉన్నట్టుండి ఒకరాత్రివేళ ఆ ఇంట్లో అంతా గొల్లుమన్నారు. ఏమైందని ఇరుగు పొరుగు జనం పోగయి అడిగితే "ఏముందీ! అనుకున్నంతా అయింది. మాయదారి రోగం కాశీంను పొట్టన పెట్టుకున్నది. ఇక మనకు కాశీంలేడు"— అనిచెప్పి కాశీంభార్య ఆలీబాబా అందరూ పెద్దపెట్టున ఏడ్వసాగారు. అటుపిమ్మట తమ మతాచారం ప్రకారం కాశీంకు అంత్యక్రియలు జరిపించారు. ఆ విధంగా కాశీం మామూలుగా

రోగంవచ్చి చనిపోయినాడనే అందరూ అనుకున్నారుకాని, అతన్ని దొంగలు హత్యచేశారన్న సంగతి ఊళ్ళో ఎవరికీ తెలియదు.

కాలం గడుస్తున్నది. బంధువులు, మిత్రులువచ్చి, కాశీం భార్యను, ఆలీబాబాను ఓదార్చి వెళ్ళారు. తమ మతాచారంప్రకారం ఆలీబాబా, అన్నభార్యను కూడా పెళ్ళాడి ఇద్దరు భార్యలతో సుఖంగా ఉంటున్నాడు. అన్నగారి ఆస్తి కూడా ఆలీబాబాకే వచ్చింది. అతను తనమకాంను అన్నగారి మేడలోకి మార్చాడు, ఇప్పుడు ఆలీబాబా గొప్పభాగ్యవంతుడు. ఆ చుట్టుప్రక్కల అతన్ని గురించి అందరూ చెప్పుకోసాగారు. ఆలీబాబా కుమారుడు ఇప్పుడు పెద్దవాడయినాడు. యుక్తవయస్సు వచ్చింది. అతనిచేత బంగారు, వెండి నగల వ్యాపారం పెట్టించాడు ఆలీబాబా. రోజురోజుకు ధనం పెరుగుతున్నది. ఆలీబాబాకు ఏలోటూలేదు. తనూ హాయిగా విశ్రాంతి తీసుకుంటున్నాడు.

ఇక్కడ ఇలాఉండగా, అక్కడ దోపిడీ దొంగలకథ. వాళ్ళు మామూలుగా ఊళ్ళమీదకిపోయి ధనం, నగలు, అమూల్యమైన వస్తువులు దోచుకుని కొన్నాళ్ళకు తమ రహస్యగుహకు తిరిగివచ్చారు. నలభైమంది దొంగలు గుహలోకి వెళ్ళి తాము తెచ్చిన ధనంసంచులు అక్కడ పడేశారు. కాని తీరాచూస్తే వారిగుండెలు గుభిల్లుమన్నాయి. తాము హత్యచేసి గుహలో వ్రేలాడగట్టిన కాశీం

మొండెం అక్కడలేదు. తెగనరికిన తల కనిపించలేదు. గుహ అంతటా వెదికారు. అంతేకాకుండా బంగారు నాణాల మూటలు కూడా కొన్ని లేకుండా పోయినవి.

## దొంగల పగ

దొంగల నాయకుడు తక్కిన దొంగలను చూచి "ఏంటిరా? ఇన్నేళ్లుగా నరమానవుడి కంటపడని మనగుహలో ఎవడ్రా అడుగుపెట్టాడు? మనగుట్టుఎవడ్రా బయటపెట్టింది? చెప్పండి, ఆ ఎదవ ఎవడో? మనలోనే ఎవడో ద్రోహి ఉన్నాడన్నమాట! నిజం చెప్పండి—లేకపోతే మీ అందర్నీ నరికిపారేస్తాను."— అని కత్తి ఝుళిపించాడు.

ఆ మాటలకు దొంగలు గజగజ వణికిపోయారు! "సత్తె ప్రమాణంగా మాకేం తెలీదు దొరా! ఎన్నో ఏళ్ళుగా మీ కాళ్ళకడ పడున్నాం. మీ ఉప్పు-పులుసూ తింటూ ద్రోహం చేస్తామా దొరా? ఎవడో పరాయి ఎదవ మనగుట్టుకనుక్కుని ఉంటాడు." అన్నారు దొంగలంతా ఏకకంఠంతో.

కాని దొంగల నాయకుడు ఊరుకోలేదు. ఆగ్రహంతో చిందులు తొక్కాడు. "మీరెన్ని చెప్పినా నేను నమ్మను. ఇంతకుముందే ఎవడో మన గుహలో ప్రవేశించాడు. వాడ్ని రెండు ముక్కలుగా నరికేశాం. వాడి మొండాన్ని వ్రేలాడగట్టాం. ఇప్పుడా మొండెం. తల మాయమైనాయి. సొమ్ముకూడాపోయింది.

అంటే ఏమిటి దీనిఅర్థం? వాడెవడో అసాధ్యుడై వుండాలి. మనం ప్రాణాలు పణంగాపెట్టి దోచుకున్న బంగారం, మట్టికొట్టుకపోయింది. పడిన శ్రమంతా బూడిదలో పోసిన పన్నీరైంది. అసలు గుహతలుపులు తెరవాలన్నా, మూయాలన్నా మంత్రం ఉందికదా! ఆ మంత్రం మరొకడు కనిపెట్టాడన్నమాట. అంటే మనపని ఇంతటితో అయిపోయిందన్న మాట!" అని గర్జించాడు.

అదివిని దొంగలకుకూడా కోపంవచ్చింది. వాళ్ళంతా కత్తులుదూశారు. "నిజమే దొరా! మనకెవడో శత్రువున్నాడు. వాడి అంతుచూస్తాం. చెప్పండిదొర ఏం చేయమంటారో! మీరు 'ఊ' అనండి. వాడు ఎక్కడున్నాసరే, వెదికి పట్టుకొచ్చి మీకాళ్ళముందు పడేస్తాం"- అని చెప్పారు దొంగలు.

అంతట నాయకుడు కొంత శాంతించాడు. కొంచెంసేపు ఆలోచించాడు. "సరేనర్రా! ఇక మనం దోపిడీలకు వెళ్ళవద్దు. మనరహస్యం కనిపెట్టిన వాడెవడో మనం వెదికి పట్టుకోవాలి. వాడ్ని హతమార్చాలి గుట్టు తెలిసిన శత్రువును మట్టుపెట్టిన తరువాతనే మళ్ళీ మనం దోపిడీలకు వెళ్ళడం. అందాకా నిద్రపోకూడదు." అని తీర్మానం చేయగా, దొంగలందరూ అది ఆమోదించారు.

అంతలో దొంగలముఠా లోనుంచి హుషారైన ఒక యువకుడు నాయకుడి ముందుకువచ్చి "దొరా! తమరు అనుజ్ఞ ఇస్తే నేను వెళ్ళి మనగుట్టు

కనిపెట్టిన ఆ ఎదవ ఆచూకీతీస్తా. ఎక్కడున్నా సరే, కనుక్కొనివస్తా. దొరగారి పాదాలమీద ఆన!"— అన్నాడు ధైర్యంగా.



నాయకుడు వాడి మాటలకు ఎంతో సంతోషించాడు. "అట్టాగేరా, వెళ్ళిరా! నీలాంటి గుండె కలవాళ్ళే నాక్కావాలి. జాగ్రత్తగా పనిచేసుకుని రా! నీవు మాత్రం పట్టుబడబాక"— అని నాయకుడు చెప్పాడు.

యువకుడు దొర పాదాలకు మొక్కి, మామూలు బాటసారి వేషం వేసుకుని బయలుదేరాడు. అరణ్యప్రాంతంలో చుట్టుప్రక్కలగల ఊళ్ళని తిరి

గాడు. కాస్త అనుమానం తగిలిన వాళ్ళందర్నీ విచారించాడు. కాని ఎక్కడా గుహలో ప్రవేశించి, ప్రాణాలు పోగొట్టుకొన్న కాశీం జాడగాని, అతన్ని గురించి చెప్పేవారుగాని దొరకలేదు. అయినా దొంగల ముఠాలోని యువకుడు నిరుత్సాహ పడకుండా, నిరాశచెందకుండా అన్ని ఊళ్ళు తిరుగుతూ ఆలీబాబా ఉండేఊరికి వచ్చాడు. ఊరి చివర, ఎడంగా ఉన్న దర్జీ ఇంటికి వచ్చాడు.

ఆ దర్జీ బాటసారి వేషంలో వున్న దొంగను ఆహ్వానించి, ఆతిధ్యం ఇచ్చి మర్యాదచేశాడు. తాను తీర్ధయాత్రలు సేవిస్తూ ఈ ఊరువచ్చానని దొంగ ఎంతో నమ్మకంగా చెప్పడంతో దర్జీకి అతనిపై భక్తి, నమ్మకం ఏర్పడినాయి. ఇంకా యాత్రలు తిరగవలసివున్నదని, వీలయితే మక్కా వెళ్ళాలనుకుంటానని, అయితే అందుకు అవసరమైన ధనంలేదని చెప్పాడుదొంగ. దర్జీ, అతనికి ఒక బంగారు నాణెం ఇచ్చి, "అల్లాపేరుమీద ఆ డబ్బు తీసుకో"మని కోరాడు. దాన్ని తీసుకుని మారువేషంలో ఉన్న దొంగ ఇటు—ఇటు త్రిప్పిచూచాడు. తాముదోపిడీ చేసి తెచ్చిన బంగారునాణాలలో అది ఒకటి అని వెంటనే గ్రహించాడు. అయితే, తనముఖంలో ఎలాంటి మార్పు కనపడనీయకుండా దొంగ "అయ్యా! దర్జీపని చేసుకుని సామాన్యమైన బతుకు బతుకుతున్న మీకు అపురూపమైన ఈ బంగారు నాణెం ఎక్కడనుంచి వచ్చింది?" అని ఏమీ ఎరగనట్లు అడిగాడు. "బాబూ! ఏం

చెప్పను? నీవన్నట్లు నేను అతి సామాన్యుడను. గుడ్డలుకుట్టగా వచ్చిన కూలి డబ్బులతో ఏపూటకాపూట గడుపుకునేవాడను. అయితేనేం అల్లాదయ ఎప్పుడు ఎవరి మీద ఎలా ప్రసరిస్తుందో ఎవరికీ తెలియదు." అంటూ ఆ ఊళ్ళోనే ఒకవ్యక్తి తనను రాత్రిపూట కళ్ళు గంతలుగట్టి ఒక ఇంటికి తీసుకునిపోయి తల, మొండెం వేరుచేయబడి ఉన్న శవాన్ని అతికించి కుట్టించాడని, పిమ్మట ఇలాంటి బంగారు నాణాలు పది ఇచ్చాడని, ఆలీబాబా తనతో చేయించిన పనిని గురించి చెప్పాడు. దొంగ అనుమానం బలపడింది. "అయ్యా! నాకా ఇల్లు చూపగలవా? ఆ ధనవంతుడ్ని భిక్ష అడిగితే నా యాత్రకు కావలసిన ధనం ఇస్తాడని నా ఆశ"— అన్నాడు దొంగ అమాయకంగా.

"అయ్యా! చెప్పానుకదా, నా కళ్ళకు గంతలుకట్టారనీ, అయినా ఎన్ని వీధి మలుపులు తిరిగి ఏ దిక్కుగా ఎంతదూరం నన్ను తీసుకెళ్ళిందీ చెప్పగలను." అన్నాడు దర్జీ.

ఇలా చెప్పి తెలివయిన ఆ దర్జీ, యాత్రికుడి వేషంలోఉన్న దొంగను వెంటపెట్టుకునిపోయి రెండు వీధి మలుపులు దాటి, పడమరగా రెండు వందల గజాలు వెళ్ళి అక్కడగల ఇంటిదగ్గర ఆగిపోయాడు. తాను వెళ్ళిన ఇల్లు అదే కావచ్చునని కూడా దర్జీ సూచించాడు. దొంగ ఆ ఇల్లు గుర్తుపెట్టుకుని దర్జీకి పదే

పదే సలాంచేసి "అల్లా నీకు మేలుచేస్తాడు!" అని దీవించి అక్కడనుంచి వెళ్ళి పోయాడు. ఆ రాత్రి ఎవరికంటా పడకుండా దర్జీ చూపించిన ఇంటిబయటవాకిలిపై ఒక సుద్దముక్కతో ఇంటూ(X)గుర్తుపెట్టి వెళ్ళాడు. ఆ ఇల్లుఎవరిదోకాదు. కాశీం మేడ. ఇప్పుడు అలీబాబా కుటుంబం ఆ మేడలోనే వుంటున్నది.



ఆ విధంగా కూపీలాగిన దొంగ మరునాడు గుర్రంమీద వరుగుపరుగున అడవిలో గుహకు చేరుకుని దొంగల నాయకుడికి సలాంచేసి తాను కనిపెట్టిన సంగతి యావత్తు వివరంగా చెప్పాడు. నాయకుడు చాలా సంతోషించాడు. వెంటనే దొంగలందర్నీ యాత్రికుల వేషాలువేయించి, అచూకీ కనుగొన్న యువకుని వెంట పెట్టుకుని, అతను దారిచూపిస్తూ ఉండగా గుర్రాలపై బయలుదేరి ఆలీబాబా గ్రామం చేరుకున్నారు. అక్కడ ఊరిబయట నాయకుడు ఒక రహస్యస్థలంలో మకాం చేశాడు. యువకుడ్నీ కొందరు దొంగల్ని ఊళ్ళోకి పంపి ఆ ఇంటిలో మనశత్రువు ఉన్నాడో లేడో కనిపెట్టి రమ్మని పంపాడు.

# దాసీ మార్జియానా ఉపాయం

అయితే ఈలోగా దాసీ మార్జియానా తన యజమాని కుటుంబానికి ఎప్పుడు ఏం ప్రమాదం ముంచుకొస్తుందో అని వెయ్యికళ్ళతో కనిపెడుతూఉంది. రాత్రింబగళ్ళు ఆ పిల్లకు దొంగలముఠాను గురించే ఆలోచన.

తెల్లవారగానే ఇల్లు, వాకిలి శుభ్రంచేస్తూ ఇంటి వీధి తలుపుపై సుద్ద ముక్కతో X గుర్తుపెట్టి ఉండడం జూచి గాభరాపడింది. ఎన్నడూలేనిది తలుపుపై

ఈ గుర్తు ఎలా వచ్చినట్లు? ఇందులో ఏదో కథ వుంది. ఇల్లు గుర్తుపెట్టుకోవడం కోసమే దొంగలో, ఎవరో ఇలా గుర్తుపెట్టి వుంటారని వెంటనే అనుమానించింది. అప్పుడు మార్జియానాకు చక్కని ఉపాయం తట్టింది. మరో సుద్దముక్క తీసుకుని ఆ వీధిలో అన్ని ఇళ్ళ తలుపులమీద అలాగే X గుర్తుపెట్టి వచ్చింది. ఏమీ ఎరగనట్లు తన పనులు చూచుకోసాగింది.

తరువాత ఆ సాయంత్రం దొంగలనాయకుడు తన అనుచరులతో ఆలీబాబా ఉన్నవీధికి వచ్చాడు. తన శత్రువు వున్నయిల్లు గుర్తుపడదామని చూచాడు. కాని ఆ వీధిలో అన్ని ఇళ్ళ తలుపులపైన ఒకే రకమైన గుర్తు ఉండడంచేత అసలు ఇల్లు ఏదో పోల్చుకోలేక తికమకపడ్డాడు. అతనికి ఎక్కడలేని ఆగ్రహం వచ్చింది. తన అనుచరుడయిన యువకుడే తనను మోసగించాడని, తన మెప్పుకోసం అబద్ధం చెప్పాడని భావించి, అతన్ని చంపివేయమని దొంగలను ఆజ్ఞాపించాడు. దొంగలు మొదటి దొంగను కత్తులతో పొడిచి చంపివేశారు.

దొంగలు మళ్ళీ ఆరాత్రికి గుహకు వెళ్ళిపోయారు. మరునాడు మరో దొంగ, మొదటివాడిలాగానే తమ శత్రువు ఇల్లుగుర్తుపట్టి వస్తానని నాయకుడికి చెప్పి, అతని అనుమతితో మారువేషం వేసుకుని ఆలీబాబా ఉన్న వూరికివచ్చాడు. దర్జీవాడికి బంగారునాణాలు యిచ్చి, అతని సహాయముతో ఒకమట్టికుండ నిండా

చిక్కని సున్నపు నీరు పోసి దాని అడుగున చిల్లి పెట్టి, కారేలా అలీబాబా ఇంటిదాకా పోసి వెళ్ళిపోయాడు. ఆ విధముగా శత్రువు ఇల్లు గుర్తు పెట్టుకోవచ్చునని అతని వూహ. తిరిగివెళ్ళి నాయకుడికి



ఇల్లు గుర్తించివచ్చానన్నాడు. మరునాటి సాయంత్రం దొంగలనాయకుడు యధా ప్రకారం తన అనుచరులతో వూళ్ళోకి వచ్చాడు. శత్రువును హతమార్చవచ్చు కదా అన్న ఆనందంతో ఆలీబాబా వున్నవీధికి వచ్చారు.

అయితే, అతని ఆశ మళ్ళీ నిరాశ అయింది. ఆరోజు ఉదయందాసీది మార్జియానా తమ ఇంటిదాకా సున్నపునీరుపోసి ఉండడంచూచి, ఇదేదో కుట్ర, దొంగలమోసం అయివుంటుందని కనిపెట్టి వెంటనే ఆ వీధిలోగల అన్ని ఇళ్ళ దగ్గరికి చిక్కని సున్నపునీళ్ళు ధారగా పోసివచ్చింది. అందుచేత దొంగల నాయ కుడు వెళ్ళిచూస్తే, అన్ని ఇళ్ళకూ అలా సున్నపునీరు పోసిన గుర్తు ఉండడం చేత అసలు శత్రువు ఇల్లేదో గుర్తించలేక, తన రెండవ అనుచరుడు కూడా మోసం చేశాడని కోపించి, అతన్ని చంపించాడు.

ఈ విధంగా రెండు ప్రయత్నాలు విఫలం కావడంతో దొంగల నాయకుడు తానే స్వయంగా శత్రువు ఆచూకీ తెలుసుకోవాలని నిశ్చయించు కున్నాడు.

## దొంగల నాయకుడి పన్నాగం

ఇంతకుముందు దొంగలు చెప్పిన గుర్తులప్రకారం ఆలీబాబా వుండే

వీధిలోకి వెళ్ళాడు, మారువేషంలో దొంగలనాయకుడు. అతను భక్తుడైన యాత్రికుడి వేషం వేసుకుని ఆ వీధిలోవుండేజనం దగ్గరికివెళ్ళి, అక్కడ ధనవంతులెవరని అడిగాడు. వారు ఆలీబాబా విషయం చెప్పారు. ఇంతకుముందు ఆలీబాబా అన్న కాశీం చాలా భాగ్యవంతుడుగా ఉండేవాడు.

ఆలీబాబా తిండికి కూడా లేని దరిద్రుడనీ, అయితే, అతనికి హఠాత్తుగా ఐశ్వర్యం వచ్చిపడిందని జనంచెప్పారు. అన్న కాశీం ఏదో మాయరోగం వచ్చి, ఆకస్మికంగా చనిపోయాడనీ, దాంతో అన్న ఆస్తి కూడా ఆలీబాబాకు సంక్రమించి ఇప్పుడు అమిత భాగ్యవంతుడైనాడని వారు వివరంగా తెలియజేశారు. అది విని దొంగలనాయకుడు గుహలో ప్రవేశించి ధనం కాజేసినవాడు ఆలీబాబాయే అయి వుంటాడని వూహించాడు. యాత్రికుడిలా ఆలీబాబా ఇంటికి వెళ్ళాడు.

ఇంటికి అతిథులు ఎవరు వచ్చినా ఆతిథ్యం ఇచ్చి మర్యాదలు చేయడం ఆలీబాబాకు అలవాటు. అందులోనూ బాటసారులు, భగవద్భక్తులు వస్తే ఇంకా ఎక్కువ గౌరవంగా చూస్తాడు. అంచేత బాటసారివేషంలో వున్న దొంగల నాయకుడికి సుష్టుగా భోజనం పెట్టించి, విశ్రాంతి తీసుకోవడానికి మంచం, ప్రక్క వేయించాడు. దొంగల నాయకుడు ఆ కబుర్లూ, ఈ కబుర్లు చెపుతూ వుంటే ఆసక్తిగా వింటున్నాడు ఆలీబాబా. ఆ సమయంలో దొంగలనాయకుడి చూపు గోడ

మీద వ్రేలాడుతూ వున్న కాశీం చిత్రపటంమీద పడింది. చిత్రపటం చూచి దొంగల నాయకుడు చకితుడైనాడు. గుహలో తాను నరికిచంపిన మనిషి అతనేనని గుర్తుపట్టాడు. ఒక్క క్షణం ఆగి, ఏమీ ఎరుగనివాడిలా "అయ్యా! అందంగా వున్న ఆ చిత్రపటం ఎవరిది?" అని అడిగాడు ఆలీబాబాను.



"మా యన్న గారిది"... అని చెప్పాడు ఆలీబాబా!

"ఆయన పేరు?"

"కాశీం" అన్నాడు మళ్ళీ ఆలీబాబా.

"అలాగే! అచ్చా! ఇప్పుడాయన ఎక్కడున్నారు?" మళ్ళీ దొంగల నాయకుడి ప్రశ్న.

ఆలీబాబా తలదించుకుని "ఆయన ఇటీవలే చనిపోయారు?" అని చెప్పాడు. అతని కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"అరె! అల్లా! పాపం ఏం జబ్బుచేసింది?"—

"ఏం చెప్పమంటారు? ఏదో అంతుపట్టని రోగం. హఠాత్తుగా పోయాడు." చెప్పాడు ఆలీబాబా.

"అలాగా! అల్లా పులాకరేగా. ఆప్కు"- అని ఆశీర్వదించి దొంగల నాయకుడు తను ప్రయాణం సాగిస్తానని ఆలీబాబాకు చెప్పి అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

"గుహలో ప్రవేశించి, సొమ్ము కాజేసినవాడు ఆలీబాబాయే— సందేహంలేదు. మొదట వాడి అన్నను చంపివేశాం. తరువాత తమ్ముడువచ్చి గుహలో

వున్న తల, మొండెం తీసుకుపోయాడు"— అని దొంగల నాయకుడు నిర్ధారణ చేసుకున్నాడు. శత్రువు ఎవరో తెలిసిపోయాడు కాబట్టి వాడ్ని హతమార్చడం అంత కష్టమేమీకాదనుకున్నాడు. అయితే శత్రుత్వంతో కాకుండా తెలివిగా, మోసంతో ఈ పని సాధించాలని తీర్మానించుకున్నాడు. గుహకు వెళ్ళిపోయి తన ముఠా సభ్యులందర్నీ కూచోబెట్టుకుని జరిగిన విషయమంతా చెప్పాడు. ఒక ఉపాయము ఆలోచించాడు.

నలభై కూజాలు తెప్పించాడు. దొంగలందర్నీ నూనెవర్తకుల వేషాలు వేసుకుని ఒక్కొక్కరు ఒక్కొక్క కూజాలో కూచోమని చెప్పాడు. తరువాత తాను కూడా నూనెవ్యాపారివేషంవేసుకుని, నూనెకూజాలన్నీ గాడిదలమీదవేసుకుని ఆలీబాబా ఇంటికివెళ్ళి ఉపాయంగా హతమార్చాలని నాయకుడు తక్కిన దొంగలందరికీ చెప్పగా వారు చాలాబాగున్నదని మెచ్చుకుని అలాగే చేశారు.

ఆ విధంగా దొంగలు నూనె వ్యాపారుల వేషంలో ఆలీబాబా ఇంటికి రాత్రివేళ చేరుకున్నారు. ఆ రాత్రికి ఆశ్రయం ఇవ్వమని దొంగల నాయకుడు అడగ్గా, పరాయిదేశంనుండి వర్తకులు వచ్చారన్న ఉద్దేశ్యంతో అలాగే వారికి తన యింట్లో బస ఏర్పాటు చేశాడు. నూనె జాడీలన్నీ ఇంట్లోని పెరట్లో దింపించాడు, గాడిదలకు మేత అదీ ఏర్పాటుచేయించాడు. తాను సమయం కనిపెట్టి

కూజాల దగ్గరికివచ్చి సైగ చేస్తానని అప్పుడు కూజాల్లో నుంచి దొంగలు బయటికి వచ్చి ఆలీబాబాను హతమార్చాలని దొంగలకు రహస్యంగాచెప్పాడు దొంగల నాయకుడు. అప్పటిదాకా, ఎవరూ కనిపెట్టకుండా కూజాల్లోనే జాగ్రత్తగా నక్కి వుండమని ఆజ్ఞాపించాడు. అలాగే దొంగలందరూ కూజాల్లో నక్కివుండి, సమయం కోసం ఎదురుచూస్తున్నారు. ఆలీబాబా, దొంగలనాయకుడికి గొప్ప విందు చేశాడు. నాయకుడు బాగా తిని, త్రాగి ఆనందిస్తున్నాడు.

ఈలోగా ఇంటిలో దాసీ మార్జియానా చాలా తెలివైన పిల్ల కాబట్టి, ఇంటికి వచ్చిన అతిధులను మొదటనుంచీ జాగ్రత్తగా కనిపెడుతూనే వుంది. గాడిదలకు మేతవేసే నెపంతో ఆమె పెరటిలోకి వచ్చినపుడు కూజాల్లో నిజంగా నూనె వుందా లేక ఏదయినా మోసం వుందా అని జాగ్రత్తగా గమనించింది. కూజాలు కదులుతూ వుండడం ఆమె పసిగట్టింది. వెంటనే ఒక కూజాలోనుంచి నూనె వంపబోగా, అందులో మనిషి కనిపించాడు. ఆమె అనుమానం నిజమైంది. నలభై కూజాలలోనూ దొంగలున్నారని, తమ యజమానికి ఏదో అపకారం చేసే తలంపుతోనే ఇలా వచ్చారని మార్జియానా తెలుసుకున్నది.

గుట్టు చప్పుడు కాకుండా ఇంటిపనిమీద అటు—ఇటు తిరుగుతూ తప్పతాగి, ఆనందంలో మునిగివున్న దొంగలనాయకుడ్ని, ఏదీ తెలుసుకోలేనిఅమాయ

కుడైన తన యజమాని ఆలీబాబాను గమనించింది. తరువాత వంటశాలలోకి వెళ్ళి ఇంటిలో డబ్బానిండా వున్న నూనె పెద్ద గంగాళంలోపోసి పొయ్యిమీద పెట్టింది. పొయ్యిమీద పెట్టింది. పొయ్యి భగభగమండుతున్నందున నూనె సలసల కాగింది. అలాకాగిన నూనె గిన్నెలతో పట్టుకునివచ్చి పెరటిలో ఉన్న కూజాలో పోయటం



మొదలు పెట్టింది. దాంతోజాలో నక్కికూవున్న దొంగలు ఒక్కొక్కరే, కిక్కురు మనకుండా ప్రాణాలువిడిచారు. అలా40 కూజాలలోనూ గల 40 మంది దొంగలూ హతమైపోయారు.

కొంతసేపటికి దొంగల నాయకుడు మెల్లగా దొంగలు నక్కి ఉన్న కూజాల దగ్గరికివచ్చి వాటిని నెమ్మదిగా తట్టుతూ, "ఇకరండి. అందరూ ఒక్కసారిగా లేచివచ్చి, నిద్రపోతున్న ఆలీబాబాను పొడిచి చంపండి."— అని అన్నాడు.

కాని ఎంతసేపటికీ కూజాలలోనుంచి దొంగలు బయటకి రాలేదు. అప్పుడు దొంగల నాయకుడు గాభరాపడి ఒకకూజా పూర్తిగా తెరిచిచూడగా అందులో దొంగ చచ్చిపడి వున్నాడు. అలాగే 40 కూజాలలోనూ 40 మంది దొంగలు చచ్చిపడి వుండడం చూడగానే దొంగల నాయకుడికి కంగారు, దడపుట్టు కొచ్చాయి. తాను ఒంటరివాడ్ని అయినానని, తనగుట్టు తెలిసిపోయిందని,ఇక్కడ ఉండడం ప్రమాదమని గ్రహించి దొడ్డి దోవన పలాయనం చిత్తగించాడు.

ఈ విషయం ఎక్కడా బయటకి పొక్కనివ్వలేదు మార్జియానా. మరునాడు తెల్లవారింది. ఆలీబాబా మార్జియానాను పిలిచి "నూనె వర్తకుడు నిద్ర లేచాడా? ఆయనకు ఏం కావాలో చూడు?" అన్నాడు.

అదివిని మార్జియానా "ఇంకెక్కడి నూనె వర్తకుడు బాబా? రాత్రి ఉడాయించాడు చెప్పకుండా!" అన్నది.

"అదేమిటి?" అని అడిగాడు అలీబాబా.

అప్పుడు మార్జియానా జరిగిన సంగతంతా వివరించి చెప్పింది. ఎన్నో రోజులుగా దొంగలు తమ ఇంటిపై కన్నువేసి వుంటారనీ, మాయవేషాలతో వచ్చి ఒకసారి తలుపుపై గుర్తుపెట్టడం, మరోసారి ఇంటిదాకా సున్నపు నీళ్ళు పోయడం, అయితే కనిపెట్టడానికి వీలులేకుండాతాను వీధిలో అన్ని తలుపులపైన గుర్తులు పెట్టడం, అన్ని ఇళ్ళ దగ్గరా సున్నపునీరు పోయడం మొదలయిన సంగతులు తెలిపింది. పిమ్మట దొంగల నాయకుడు నూనె వ్యాపారి వేషంలోనూ, దొంగలు కూజాలలో నక్కి వుండిరావడం తాను కనిపెట్టి నూనె కాచి కూజాలలో పోసి, చంపివేయడం వివరించింది. అది కనిపెట్ట మారువేషంలో వున్న దొంగల నాయకుడు గుట్టుచప్పుడు కాకుండా రాత్రికి రాత్రే పలాయనం చిత్తగించాడని తెలియచేసింది.

మార్జియానా చెప్పిందంతా విని అలీబాబా ఆశ్చర్యచకితుడైనాడు. తన తెలివి తక్కువ తనానికి విచారిస్తూ, మార్జియానా తననూ, తన కుటుంబాన్నీ కాపాడినందుకు ఆమెను అనేక విధాల ప్రస్తుతించాడు.

"మార్జియానా! నీవు మా ప్రాణాలను కాపాడిన దేవతవు. నీ ఋణం ఎలా తీర్చుకోనమ్మా." అన్నాడు అలీబాబా ఆనదంతో.

"బాబా! ఇందులో ఋణమేమీలేదు. ఇది నా ధర్మం. చిన్నప్పటి నుంచీ నేను మీ వుప్పు-పులుసూ తిని పెద్దదాన్నయ్యాను. ఇప్పుడు నాకు యుక్త మనస్సువచ్చింది. అయినా మీరునన్ను ఎంతో ప్రేమతో చూస్తున్నారు. మీ కుటుంబంలో ఎవరికి ఏ ఆపద వచ్చినా ఆదుకోడం నా ధర్మం.ఎవరు ఎలాంటి ఎత్తులూ, మోసాలు పన్నినా ఈ మార్జియానా దగ్గర సాగవు బాబా!" అని చెప్పింది మార్జియానా వినయంగా.

అందావిని అలీబాబా అల్లాను ప్రార్థించుకుంటూ మార్జియానాను వెంటపెట్టుకుని పెరట్లోకి వెళ్ళారు. అక్కడ కూజాల్లో చచ్చిపడివున్న దొంగలను చూచాడు.

"అయితే. ఇప్పుడీ శవాలన్నింటినీ ఏం చేద్దాం?" అడిగాడు అలీబాబా.

"మన దొడ్లోనే గొయ్యితీసి పూడ్చేద్దాం" అని చెప్పింది మార్జియానా.

ఆమె చెప్పినట్లే శవాలను పాతి పెట్టించాడు అలీబాబా.

"అయితే బాబా! ఇంతటితో ప్రమాదం తప్పిపోయిందని నేను అను కోను. పారిపోయిన ఆ దొంగల నాయకుడు మళ్ళీ ఏదో యుక్తిపన్ని ఇక్కడికి వస్తాడు. పగతీర్చుకోడానికి. అంచేత మీరు చాలా జాగ్రత్తగా ఉండాలి"— అని హెచ్చరించింది మార్జియానా.

రోజులు గడిచాయి. మార్జియానా చెప్పినట్లు పారిపోయిన దొంగల నాయకుడికి గుండెల్లో పగ మండుతున్నది. తన వాళ్ళంతా నాశనమైపోయారు. దీనికంతటికి కారణం ఆలీబాబా కదా! కాబట్టి శత్రుశేషం లేకుండా అతన్ని హతమారిస్తేకాని తన కంటి నిండా నిద్రపట్టదు. అందుచేత నాయకుడు ఈసారి నగల వ్యాపారివేషం వేసుకుని. తను దోచుకున్న సొమ్ముతో రకరకాల నగలు, రత్నాలు మూటకట్టుకుని ఆలీబాబా వూరు వచ్చాడు.

ఆలీబాబా కుమారుడు ఛోటేబాబాతో స్నేహం చేశాడు. ఛోటేబాబా కూడా నగల వ్యాపారి కాబట్టి అతన్ని ఆదరించి తన అంగట్లోనే ఒక గదిలో వుండమని చెప్పాడు. ఇప్పుడు దొంగల నాయకుడి పేరు బహదూర్‌షా. అతను తనవద్దగల నగలు. రత్నాలు చౌకధరకు ఛోటేబాబాకు విక్రయించాడు.

ఛోటేబాబా వాటిని హెచ్చు ధరకు అమ్ముకుని, బాగా లాభాలు గడించాడు. ఆ విధంగా తన వ్యాపారం ఎంతగానో వృద్ధిపొందడం

వలన బహదూర్‌షాపైఅతనికి గౌరవం అభిమానంపెరిగాయి. ఇప్పుడు వారిద్దరూ ప్రాణస్నేహితుల్లా మెలగుతున్నారు.

# దొంగల నాయకుడి అంతం

ఇలా ఉండగా ఒకరోజు ఛోటేబాబా, నగల వర్తకుడు బహదూర్ షాను తన ఇంటికి ఆహ్వానించాడు. అలాంటిరోజు ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూస్తున్న దొంగలనాయకుడు సంతోషంగా ఆలీబాబా ఇంటికి వెళ్ళాడు. వ్యాపారంలో పెద్దపెద్ద లాభాలు రావడానికి ఇతడే కారకుడని కుమారుడిద్వారా తెలుసుకున్న ఆలీబాబా, బహదూర్‌షాను గాఢంగా కౌగిలించుకుని ఆతిధ్యం ఇచ్చి మర్యాదలు చేశాడు.

అంతట ఒకనాడు ఛోటేబాబా పుట్టినరోజు వచ్చింది. కుమారుడి జన్మదినోత్సవం ఘనంగా చేయాలనుకున్నాడు ఆలీబాబా. ఆరోజు తమ ఇంటికి విందుకు రావలసిందిగా బహదూర్ షాను ఆహ్వానించాడు. బహదూర్ దానికి అంగీకరించాడు.

అయితే, అతన్ని మార్జియానా చూసింది. అతని చూపులు, ఆలీబాబా

పట్ల ఛోటేబాబాపట్ల అతను చూపుతున్న ప్రేమ, అభిమానం ఇదంతా నటన అని అతను ఏదో అపకారం చేయడానికి వచ్చిన మోసగాడని ఆమె కనిపెట్టింది.



అలీబాబాను ఒంటరిగా లోపలికి పిలిచి "అయ్యా! అబ్బాయిగారి పుట్టిన రోజు పండుగనాడు మీరు ఆ కొత్తవ్యాపారిని విందుకు పిలిచారు. కదా!

ఆరోజు గొప్ప నాట్యప్రదర్శన కూడా వుంటుందని చెప్పండి. నేనే నాట్యం చేస్తాను. అది కత్తుల నాట్యం! కొత్తరకంగా ఉంటుంది."— అని చెప్పింది.

ఆలీబాబా అలాగే బహదూర్‌షాను ఆహ్వానించాడు. బహదూర్‌షా అందుకు అంగీకరించాడు. ఆరోజు రాత్రివేళ ఏదో విధంగా ఆలీబాబాను సంహరించాలని దొంగల నాయకుడి సంకల్పం.

ఛోటేబాబా జన్మదినోత్సవం రానేవచ్చింది. ఆలీబాబా భవనం దీపకాంతులతో కళకళలాడుతున్నది. ఇంటినిండా జనం. బంధువులు, స్నేహితులు. ఊళ్లోని పెద్దలు, భాగ్యవంతులు- అంతా అక్కడ వున్నారు. కుమారుడి పుట్టిన రోజు సందర్భంగా ఆలీబాబా అందరినీ ఆహ్వానించి అతిథిమర్యాదలు చేస్తున్నాడు. దొంగనగల వ్యాపారి బహదూర్‌షాకూడా రంగురంగుల దుస్తులు ధరించివచ్చాడు. చోటేబాబా, ఆలీబాబా అతనికి ప్రత్యేకంగా గౌరవ మర్యాదలు చేస్తున్నారు.

తరువాత విందుభోజనాలు ప్రారంభమైనాయి. రకరకాల భోజన పదార్థాలు. ఎన్నో కమ్మని మిఠాయిలు, పిండివంటలు, విలువయిన పళ్ళెరాలలో పెట్టుకుని భుజిస్తున్నారు. ఒకవైపు వివిధ రకాల ఫలాలు, పండ్లు, పెట్టి వున్నాయి. అవి ఆరగిస్తున్నారు కొందరు. మరోవైపు బాణాసంచా కాలుస్తున్నారు. కొందరు వృద్ధులు చోటేబాబాను దీవించిపోతున్నారు. యువకులు కొందరుచోటేబాబాను కౌగి

లించుకుని జన్మదిన శుభాకాంక్షలు అందచేస్తున్నారు. అందమైన యువతులు కమ్మగా పాటలు పాడుతున్నారు.

నగల వర్తకుడి వేషంలో ఉన్న బహదూర్ షా, అలీబాబా, కోసీ బాబాల వైభవం చూచి పైకి ఎంతగానో ఆనందిస్తున్నా, మనస్సులో చాలా బాధ పడుతున్నాడు. తమరహస్యం తెలుసుకుని, తాము దోచుకున్న ధనంకాజేసి ఇంతటి ఐశ్వర్యవంతుడైనాడుకదా అని అతని కడుపు మండిపోతున్నది. అలీబాబాను ఎప్పుడు హతమారుద్దామని ఉబలాటపడుతున్నాడు. అందుకోసం రత్నాల పిడిగల వాడిబాకు ఒకటి బొడ్డులో సిద్ధంగా పెట్టుకుని ఉన్నాడు.

వేడుకలు, వినోదాలు అయిపోయిన తరువాత అతిథులు చాలామంది అలీబాబా, కోసీబాబాల వద్ద సెలవు పుచ్చుకుని వెళ్ళిపోయారు. పిమ్మట మార్జి యానా సూచనపై అలీబాబా బహదూర్ షాను ఇంటిలోపల మధ్య వరండాలోకి పిలిపించాడు. గోడకు ఆనించి నేలమీద పరచివున్న పట్టు పరుపులపై అలీబాబా, కోసీబాబా, బహదూర్ షాలు ఆశీనులైనారు. పెద్దపెద్ద బాలీసులకు ఆనుకుని విశ్రాంతిగా వున్నారు. అప్పుడు దాసీపిల్ల మార్జియానా, అలీబాబా తెప్పించి ఉంచిన ఖరీదైన మద్యాన్ని అందమైన కూజాలోనుంచి, తళతళలాడే గాజుగ్లాసుల్లో పోసి, వయ్యారాలు ఒలకపోస్తూ బహదూర్ షాకు అందించింది. అతను గ్లాసు అందుకుని

ఆనందంగా సేవించడం ప్రారంభించాడు. పిమ్మట రెండు గ్లాసులలో పోసి తన యజమాని ఆలీబాబాకు, చోటేబాబాకు అందించింది. వారుకూడా గ్లాసులు అందుకుని మద్యం సేవిస్తున్నారు.

"దోస్త్! మీకోసం ఈ మద్యం తెప్పించాం. మాకు అంతగా అలవాటు లేదు. ఏదో అప్పుడప్పుడు మీలాంటి అతిధులు వచ్చినప్పుడు తప్ప." అన్నాడు చోటేబాబా, బహదూర్‌షాతో.

"మీ ఆనందం కోసమే ఇదంతా! ఇప్పుడు మా దాసీకన్య మార్జియానా నాట్యం చేస్తుంది. నాట్యంలో ఆ పిల్ల అందెవేసిన చెయ్యి. చూచి హాయిగా ఆనందించండి సాబ్ అన్నాడు" ఆలీబాబా.

మార్జియానా తెర అవతలికి వెళ్ళి అందమైన దుస్తులు వేసుకుని. నడుం చుట్టూ చిన్న చిన్న కత్తులు కట్టుకున్నది. రెండు చేతుల్లోనూ రెండు బాకులు పట్టుకుని, కాళ్ళకు గజ్జలు కట్టుకునివచ్చి నాట్యం చేయడం మొదలుపెట్టింది. ఇద్దరు సేవకులు ఒకడు తబలా, మరొకడు హార్మోనియంలాంటి సంగీత వాయిద్యం వాయించసాగారు.

మార్జియానా పాటపాడుతూ నృత్యం చేస్తున్నది, అలా ఆమె నృత్యంచేస్తూ బహదూర్‌షా ముఖకవళికలు ఎప్పటి కప్పుడు కనిపెడుతూవచ్చింది.

అతను దేనికోసమో ఆదుర్దాపడుతున్నట్లు ఆరాట పడుతున్నట్లు గ్రహించింది. అంతేకాకుండా అతను తన బోడ్డులో బాకు పెట్టుకుని ఉండడం కూడా గమనించి, అతను దుర్మార్గపు తలంపుతో ఉన్నాడని గ్రహించింది తెలివయిన మార్జి యానా.

కొంతసేపు ఆట, పాట సాగినవి. అది కత్తుల నాట్యం కాబట్టి మార్జి యానా ఒకసారి ఆలీబాబాదగ్గర, ఇంకోసారి చోటేబాబా దగ్ధర బాకులు చూపిస్తూ, భయపెడుతున్నట్లు నటిస్తూ నృత్యం చేసింది. అలాగే బహదూర్‌షా దగ్గరికి వెళ్ళి, కత్తులు అతని గుండెలకు ఆనిస్తూ నాట్యం సాగించింది. అది ఆ నాట్య తీరు కాబట్టి అతనికి ఏమీ అనుమానం కలుగలేదుకాని, ఆ అమ్మాయి తన రికి వచ్చినప్పుడు మాత్రం అతని గుండెలు ఝల్లుమనేవి.

అలా కొంతసేపు నాట్యంచేస్తూ ఉన్నట్లు నటిస్తూ మార్జియానా, హఠ త్తుగా తనచేతిలో ఉన్న బాకుతో బహదుర్‌షా గుండెల్లో పొడిచింది. అంతే! ఆ దొంగనగల వర్తకుడు "అరె, అల్లా!" అంటూ వెనుకకు వాలిపోయాడు. అతని గుండెలలో నుంచి రక్తం చిమ్మింది: పట్టు పరుపులు, బాలీసులు- ఆ ప్రదేశం అంతా నెత్తురు వరదలైంది. ఆలీబాబా, చోటేబాబాలకు ఇదేమిటో అర్థం కాలేదు. కాని తాము గౌరవించిన అతిధిని ఇలా అన్యాయంగా హత్యచేసినందుకు వాళ్ళిద్దరికీ మార్జియానాపై ఎక్కడలేని కోపం వచ్చింది:

"ఓసీ, పాపిష్టిదానా? ఏమిటిది? ఎంత ఘోరం చేశావే!"— అన్నారు ఇద్దరూ కళ్ళెర్రచేస్తూ.

"బాబా! అయ్యా చిన్నబాబూ? దయచేసి శాంతించండి. మీకు అంతా చెపుతాను. నేను మీకు మేలుచేసేదాన్నే కాని, మీకు అవమానం, అగౌరవం తెచ్చిపెట్టేదాన్ని కాను. నా మాట నమ్మండి"— అన్నది మార్జియానా శాంతముగా.

అయినా ఆలీబాబాకు ఆగ్రహం ఆగలేదు. అంతలో విందుకు వచ్చి ఇంకా ఇళ్ళకు వెళ్ళకుండా వున్న బంధుమిత్రులు కొందరు ఈ అరపులు విని లోపల వరండాలోకి వచ్చారు. అప్పుడు మార్జియానా ప్రాణాలు కోల్పోయి నేలపై పడి వున్న బహదూర్‌షా దగ్గరికి వెళ్ళి, అతని వేషాన్ని తీసివేసింది.

"అయ్యలారా? వినండి— అంతా వినండి— చూశారు కదా ఇతని వేషం. ఇతను పెద్దమనిషికాడు. నగల వర్తకుడు కానేకాడు. దోపిడీదొంగ, పుండాకోరు వెధవ. నా యజమాని ఆలీబాబాను, ఆయన కుటుంబాన్ని నాశనం చేయాలన్న తలంపు చాలాకాలంనుండీ కుట్రలు పన్నుతున్నాడు. అయితే, నేను వేయికళ్ళతో కనిపెట్టి ఉండి ఆ కుట్రలన్నీ భగ్నం చేశాను. ఇవాళ మా బాబాను చంపడానికే వీడు ఈ విందుకువచ్చి, సమయం కనిపెట్టి ఉన్నాడు. అది గ్రహించి నేను ముందుగానే వీడ్ని హతమార్చాను. నామాట అబద్ధమేమో చూడండి.

రహస్యముగా బొడ్డులో కత్తిపెట్టుకున్నాడు." అనిచెప్పి మార్జియానా, బహదూర్ మొలలోవున్న కత్తితీసి అందరిముందూ పడేసింది.

బహదూర్ వేషం చూచి, మార్జియానా చెప్పినమాటలు విని, ఆలీబాబా, అతని కుమారుడు కాకుండా అక్కడున్నవారంతా విస్మయంతో ముక్కుమీద వ్రేలు వేసుకున్నారు.

తరువాత మార్జియానా సలహాపై దొంగల నాయకుడి శవాన్ని తీసుకునిపోయి దొడ్లో గొయ్యితవ్వి పూడ్చిపెట్టాడు ఆలీబాబా. "బాబా! ఇక దొంగల పీడా వదిలిపెట్టింది. ఇక మీకేమీ భయంలేదు. నిశ్చింతగా ఉండవచ్చు." అన్నది మార్జియానా, సంతోషంగా.

"ఇదంతా నీ చలవే మార్జియానా! నన్నూ నా కుటుంబం నీ వల్లనే బ్రతికి పోయిందమ్మా! నీవుచేసిన ఈ మహోపకారానికి నేను ఎలా బదులు తీర్చుకునేదమ్మా?"— అన్నాడు ఆలీబాబా.

"నాకేం చేయనక్కరలేదు బాబా! మీ అభిమానం, దయ ఉంటేచాలు" అన్నది మార్జియానా.

అయినా, ఆలీబాబా ఆలోచించడం మొదలుపెట్టాడు. భార్యతోనూ వదినెతోనూ ఏకాంతంగా ఆలోచించాడు. మార్జియానాను తను కోడలుగా చేసుకుంటే బాగుంటుందన్న నిర్ణయానికి వచ్చారు అంతా.

# మార్జియానా పెళ్లి

నిజానికి మార్జియానా చాలాచక్కనిది. గుణవంతురాలు. నీతిమంతు రాలు. తమ కుటుంబాన్ని మహావిపత్తునుండి ఆదుకున్న పిల్ల. చోటేబాబాకు ఆ పిల్లని చేసుకుంటె ఇద్దరూ ఈడు-జోడుగా, ముచ్చటగా ఉంటారు. కుమారుడి అభిప్రాయం అడిగాడు ఆలీబాబా. వాస్తవానికి అతనికూడా ఎప్పటినుంచో మార్జియానాపై మనసున్నది. తనకై తాను ఈ విషయం బయటపెట్టలేక ఇంత కాలం ఊరుకున్నాడు. ఇప్పుడు తల్లిదండ్రులు అడిగేసరికి మారుమాటాడకుండా సంతోషంతో సమ్మతించాడు.

ఇంకేం? ఒక మంచిరోజు చూచి మార్జియానా, చోటేబాబాలకు వైభ ఘంగా పెళ్ళి జరిపించాడు ఆలీబాబా. ఆ చుట్టుప్రక్కల ఊళ్ళవాళ్ళందరికి భోజనాలు పెట్టి, ఘనంగా మర్యాదలు చేశాడు. మార్జియానా ఆనందానికి అవధుల్లేవు.

దొంగల రహస్యగుహసంగతి ఆలీబాబాకుతప్ప మరెవ్వరికీ తెలియదు. అతను ఒకరోజు గాడిదలను తోలుకుని గుహకు వెళ్ళాడు. మంత్ర వాక్యాలుపలికి గుహద్వారం తెరిపించాడు.గుహలోకివెళ్ళిలోపలవున్న నగలు,నాణాలు అమూల్యమైన వస్తువులు-అన్నీ గాడిదలపై వేసుకుని ఇంటికి తీసుకొచ్చాడు. ఇప్పుడు ఆలీబాబా, ఆ దేశంలోనే గొప్ప ధనవంతుడు. అయితే, దొంగలు

వృద్ధుడైపోయాడు. అతనిభార్య, అన్న భార్య కూడా వృద్ధురాండ్రైనారు. కుటుంబ భారం, ఆస్తిపాస్తులు—అన్నీ కుమారుడికి అప్పగించి ఆలీబాబా, తన ఇద్దరు భార్యలతో మక్కా యాత్రవెళ్ళి శేషజీవితాన్ని అక్కడే గడిపాడు.

—సమాప్తం—





